





వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాంటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---



పార్వతీ పరమేశ్వరులు




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# పండిత నెహ్రూ

పండిత నెహ్రూను ఎందరు ఎన్నివిధాల విమర్శించినా గాంధీజీ అనంతరము ఏకైక జాతీయనాయకుడుగా ఒప్పినవాడు పండిత జవహర్లాల్ నెహ్రూ యొక్కడే. ఆయన జాతీయసమరములో నిర్వహించిన పాత్ర, చేసినత్యాగము, ఆయనకు జాతీయ శ్రేయస్సుపట్లగల ఆసక్తి శంకించగల వారెవ్వరులేరు. ఆయన శక్తి సామర్థ్యాలు, జాతీయ, అంతర్జాతీయ రంగాలలో ఆయన అపార అనుభవప్రజ్ఞావిశేషాలు యీనాడు ఆనాడుకూడ మనజాతీయశ్రేయస్సుకు, అభివృద్ధి అభ్యుదయాలకు అనుక్షణం వినియోగపడుతున్నవి. యావత్ప్రపంచానికి పంచశీల, సహజీవనసిద్ధాంతములద్వారా శాంతి అభ్యుదయాలను పూరించిన నాయకుడు. ప్రపంచము మొత్తం యీనాడు పండిత నెహ్రూను, మనదేశాన్ని శాంతికాముకులుగాను, న్యాయం, ధర్మంకొరకు ప్రాకులాడుతున్నవారుగాను గుర్తించిందంటే ఆ విశిష్టత ప్రధాని నెహ్రూ నాయకత్వానిదే.

ఇట్టి ఉజ్వలనాయకత్వము కలకాలము ప్రపంచమునకంతటికి అండదండలుగానుండా లనేది ప్రజల అభిమతము.

ఈ నెల 14వ తేదిన పండితనెహ్రూ జన్మదినోత్సవాలు యావద్భారతదేశం లోను జరిగినవి. భావిపౌరులైన బాలలదినంగా పరిగణించబడిన ఆదినం బాలలలో నూతనోత్సాహాన్ని, కార్యదీక్షను, సేవా త్యాగాలను ప్రోత్సహించి ఆదర్శప్రాయులుగా రూపొందించుగాక! భగవంతుడు పండితనెహ్రూకు ఆయురారోగ్యములను ప్రసాదించి, ఆయన నాయకత్వము ప్రజల శ్రేయో సౌభాగ్యములను మరింత అభ్యుదయ పంథాలో రూపొందించుగాక!

పండితనెహ్రూ జిందాబాద్

---

# ఉపాధ్యాయ వృత్తి

ఉపాధ్యాయవృత్తి ఉదాత్తమైనదని, ఉపాధ్యాయులు యితరులకు మార్గదర్శకులు కావాలనియు గుంటూరు సభలో ఆంధ్రప్రదేశ్ విద్యామంత్రి సలహాయిచ్చారు.

దేశంలో అవిద్యను నిర్మూలించి విద్యావిజ్ఞానముల వ్యాప్తిచేయుటకు ఉపాధ్యాయుల సేవాసహకారములెంతైనా అవసరము. అంతేకాదు ప్రజలలో క్రమశిక్షణ, నైతికోద్ధరణ, సత్ప్రవర్తనలాంటి సుగుణములు ఉపాధ్యాయుల మూలంగానే చిన్నప్పటి నుండి అలవడవలసియున్నవి. ఇట్టి గురుతరమైన బాధ్యతలుగల ఉపాధ్యాయవృత్తి ఉదాత్తమైనదనుటలో వివాదమేమియు లేదు. కాని ఉత్సాహంగా వృత్తిని స్వీకరించి చిత్తశుద్ధితో బాధ్యతలు నిర్వహించుటకు తగిన వాతావరణము ఉపాధ్యాయులకు ఏర్పడలేదు. ఇతరయావలకతీతుడై భావిపౌరులను రూపొందించుటకు చిత్తశుద్ధితో పూనుకోడానికి వలసిన నిలకడైన జీవనభృతి లోటుకావడంవలన మతిస్థిమితములేక తప్పటడుగులు వేస్తున్న అనేకమందిని నిందించి లాభంలేదు. ఉపాధ్యాయులకు జీవితావసరాలకులోటులేని ఆదాయం యుండాలి. ఆ నాడే జాతీయశ్రేయస్సును ద్దేశించి కృషి చేసి ప్రజలకు మార్గదర్శకులు కాగలుగుతారు.

ఉపాధ్యాయుడుగా రూపొందడానికి, వృత్తిస్వీకరించడానికి, ప్రోత్సాహం, రక్షణ, గ్యారంటీలుండాలి. వీనిని ప్రభుత్వము గుర్తించాలి.



# భక్తియోగ ప్రశ్నోత్తరి

మూలము :
"అవతార్"

★

అనువాదము :
"శివానంద పాదసేవక్"

## శ్రీ శివానంద భగవాన్

## శ్రీ స్వామి శ్రీసివాసానంద సరస్వతి

భక్తియోగముయొక్క సారమునంతను శ్రీ శివానంద గురుభగవానులు నలుబది యెనిమిది (48) ప్రశ్నలు, వాటికి సమాధానముల రూపమున నొసగి యుండిరి. వీటి పఠనచే పాఠకుల సర్వసందేహములు తప్పనిసరిగ నివృత్తియయి భక్తిహీనులను భక్తులుగను, భక్తులను పరాభక్తులుగను నొనర్చితీరును. సర్వులు నాచరణచే ధన్యులగుదురు గాక !

**1. జీవితముయొక్క గమ్యమేది ?**

ఆత్మ సాక్షాత్కారము (Self-realisation) లేక భగవచ్చైతన్యము (God-consciousness) యొక్క ప్రాప్తి.

**2. మోక్షముయొక్క స్వరూపమెట్టిది ?**

సర్వదుఃఖ నివృత్తియు మరియు పరమానంద ప్రాప్తియును. సర్వవిధములగు కష్టముల పరిహారము (removal) ను, నుత్కృష్టమగు సుఖము యొక్క సిద్ధియును.

**3. ఈ కఠినయుగములో సులభముగ మీరెట్లు మోక్షమొందగలరు ?**

హరినామస్మరణ, దైనందిన హరినామ సంకీర్తన చేయుచుండుటద్వారా.

**4. భక్తియోగ మననేమి ?**

ఏది ప్రాపంచిక జీవనపు కొఱతల (wants) కోరికల, కష్టములయొక్క విరమణ (నివృత్తి) గొనితెచ్చునో మానవునకిచెందిన నాత్మయొక్క భాగధేయుడగు భగవానునిపట్ల నెందులో ననురాగముగలదో నాభక్తిమార్గమే అది. అది జీవుని భగవానునితో నైక్యమొనర్చు ప్రేమ పంథా (Path) యే.

**5. రామునికంటె సహితమేవస్తువు ఘనతరమైనది ?**

రామ నామము.

ఎటుల ?

శ్రీరామునితో హనుమానుడు : "ఓ నా ప్రభూ! పరాత్పరుడవగు నీకంటెను కూడ కొండొకటి యుత్కృష్టమైనది గలద"ని తెల్పెను. శ్రీరాముడు సంపూర్తిగ నాశ్చర్యమందెను. ఆయన హనుమానుని "ఏవస్తువు హనుమంతా! నాకంటెను శ్రేష్ఠమైనది ?" యని యడిగెను. హనుమానుడు : "హే ప్రభూ! నీవు నదిని పడవ సహాయముతో దాటితివి కాని నేను మహాసముద్రమును దేవదేవుడవగు నీ నామముయొక్క సహాయము, శక్తి, బలములతో మాత్రము దాటితిని. నీ నామములో మాత్రమే పాషాణములు తేలియాడెను. కాబట్టి భగవానుడవగు నీ నామము వాస్తవికముగ నీకంటెను గొప్పది.

**6. భగవంతునియొక్క (existence) కై ఋజువులెవ్వి ?**

రక్తమునుండి వీర్యము, పాలు, పిత్తము (bile లాలాజలము (saliva), ఉదరసము (gastric-juice) మున్నగునవి యుత్పత్తి గావింపబడుటకై శరీరముయొక్క జీవకణములు (cells), గ్రంథుల (glands) కెవరు చైతన్య (intelligence) మొసగిరి ? కొండరాళ్లయొక్క అంతర్విభాగముల (strata) మధ్య నిలిచియుండు కప్పకెవరాహారమిత్తురు ? తల్లి గర్భాశయములోని బిడ్డను పోషించునదియు, దాని పెరుగుదలకు సహాయమొనర్చునదియు నగు శక్తియేది ? ఒక వీర్యపుబిందువునుండి రోమములు, వ్రేళ్లు, కండ్లు, ముక్కు, కాళ్లు మున్నగువాటితోగల గొప్ప రూపమును బైటకు గొనువచ్చునట్టి యపురూపతమగు విచిత్రశక్తి యెద్ది ? అదియే భగవానుడు లేక యీశ్వరుడు లేక పాలకుడు (Ruler) సృష్టికర్త.

**7. భగవానునియొక్క స్వభావమెట్టిది ?**

భగవానుడే సత్యము. భగవానుడే ప్రేమ. భగ

వానుడే జ్యోతులలో జ్యోతి. భగవానుడు శాంతి, జ్ఞానము, సుఖము, సౌందర్యముల మూర్తిత్వము (embodiment).

**8. భగవానుడెక్కడ నున్నాడు ?**

ఆ పరాత్పరుడు మీ హృదయములో నున్నాడు. ఆయన మన హృదయములలో నంతర్యామి (అంతర్యామి).

**9. ఈ కలియుగమున సులభముగ మోక్షమిచ్చు మహామంత్రమెద్ది ?**

హరేరామ హరేరామ రామరామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

**10. భక్తి యననేమి ?**

అది భగవంతునికై సుత్కృష్టమగు ననురక్తత (devotion), తీవ్రమగు నాసక్తి (attachment) యే.

**11. భక్తిని పెంపొందించు లేక కృషి చేయుట కారుసాధన (ఉపాయము) లెవ్వి ?**

భాగవతుల, సాధుల, సన్న్యాసుల సేవ, భగవంతునియొక్క నామోచ్చారణ, సత్సంగము, హరికీర్తనము, భాగవతము లేక రామాయణ పారాయణ, బృందావనము, పండరీపురము, చిత్రకూటము లేక అయోధ్యలో వాసము. యివి భక్తి కృషిచేయుట కారుతెరవులు.

**12. హరియొక్క నామము నెవరు గానమొనర్చనగును ?**

శ్లో॥ తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా।
అమానినా మానదేన కీర్తనీయః సదా హరిః॥

ఎవడైతే పచ్చగడ్డిరేకు (blade) కంటె వినమ్రుడో, ఎవడు చెట్టువలె సహనశక్తి (power of endurance) కలిగియుండునో, ఎవడైతే గౌరవమునకు సరకుగొనకుండ పైపెచ్చు (మీదుమిక్కిలి) సర్వుల గౌరవించునో నాతడు సర్వవేళల హరినామమును కీర్తించుట కర్హతగలవాడు.

**13. భక్తిమార్గములో నైదుకంటకములే (ముండ్లు)వి ?**

శ్లో॥ జాతి విద్యా మహత్త్వం చ రూప యౌవన మేవచ।
యేతే భక్తిమార్గేషు జనితా పంచకంటకాః॥

భక్తిమార్గములో జాతి, వైదుష్యము (పాండిత్యము), హోదా, సౌందర్యము, యౌవనము నైదుముండ్లని గుర్తెరుగుము.

(సశేషము)

హరిః ఓమ్‌తత్సత్ !

(Bhakti yoga Prasnottari)
Instalment I

—•••—

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గతసంచిక తరువాయి)

40. సదాచారియైన విద్యార్థియొక్క శారీరక మానసిక శక్తులు వర్ధిల్లుతూంటాయి.

41. జీవితాన్ని సుగమసంపన్నంచేయ బుద్ధిమంతుడు వితాంత పరిశ్రమ చెయ్యాలి.

42. విద్యాధ్యయన, పుణ్య సముపార్జనకు వ్యయమయ్యే సమయం సార్థకమయి ఫలప్రదమవుతుంది.

43. పరోపకారం జాతిసేవయే మానవస్వరూపం, దీనికై మానవుడు సదాదృఢచిత్తుడై ఉండాలి.

44. జ్ఞానబలాలను సదా ఉపాసించాలి. ఏలనన ప్రపంచంలోని సమస్త పదార్థాలు వీటి శక్త్యాధారాలే.

# అల్లుడు అలిగితే...

శ్రీమతి అంబటిపూడి గోదావరమ్మ

సాయంత్రం 5 గంటలయింది. ఆఫీసు నుంచి రామారావు యిల్లు చేరేడు. అతని భార్య జానకి చిరునవ్వుతో గుమ్మందగ్గర యెదురైంది. ఆమె కాఫీకప్పు అందించింది. అందుకుంటూ, పువ్వుల పొట్లం అందించాడతను.

"ఏమండీ! మంచిమాట" అందామె వయ్యారంగా.

"అంత మంచిమాట దాచకుండా ధర్మం చెయ్యి" అంటూ చెయ్యిచాచాడు రామారావు.

"మా నాన్న దగ్గరనుంచి పండుగ పిలుపు వచ్చింది. మరి శలవుకు ప్రయత్నించండి." అంటూ ఆతృతగా అంగీకారాని కెదురుచూస్తూ నిలుచుంది జానకి.

అతని వుత్సాహం చలికాలంలో తెల్లవారుఝామున ఐస్క్రీము తిన్న చిన్న కుర్రాడి మొహంలా ముడుచుకుపోయింది.

"చాల్లెద్దూ! శక్తిలేని పరుగులు! నిరుడిస్తానన్న వాచీ యిప్పటికీ లేదు. పెళ్లిలో అలక పాన్పుమీదిస్తామన్న సైకిలుకి దిక్కు లేదు. సిగ్గులేని యీ పిలుపులెందుకు? వెళ్లడానికి వీల్లేదు." అన్నాడు విసుగుతో.

అతని పట్టుదలచూచి జానకి దిగజారిపోయింది. "అది కాదండీ! పండుగనాడు నలుగురం కలిసి ఆనందంగా వుండడం ముఖ్యంగాని డబ్బే ప్రధానమా" అంది జాలిగా.

"జానీ! నన్ను విసిగించకు. కావాలంటే నువ్వెళ్లు. మీవాళ్లు పండక్కిచ్చే చీరకన్న రైలుకర్చులే యెక్కువ. ఆ డబ్బుతో అంతకంటె మంచి చీరే కొనుక్కోవచ్చు."

భర్త అహంకారానికామె చాలా నొచ్చుకుంది. మౌనంగా వూరుకుంది.

2

ఆదివారం. ఆఫీసుకి సెలవు. మధ్యాహ్నం తీరికగా యింట్లో కూచుని టీ త్రాగుతున్నాడు రామారావు. తోటిగుమస్తా సుందర్రావు వచ్చేడు. "ఏం బ్రదర్! పండుగ పిలుపు వచ్చిందట. మీ ఆవిడ మా ఆవిడతో చెప్పేరట! ఎప్పుడేమిటి ప్రయాణం?" అని అడిగాడు సందడిగా.

"ఉండరా! సిగ్గోల నీది! పండుగలాగే వుంది!"

"అదేం! వెళ్లవా?"

"ఊహుఁ"

"ఎందుకని?"

"ఎందుకని?"

"ఎందుకురా – రైలుఛార్జీలైనా కిట్టాలి

కనకనా? రానని, శెలవు దొరకలేదనీ రాసి పోస్టుచేయించేను''

"ఓరి నీ అసాధ్యం కూల! ఎంత అబద్ధం! ఐనా చూడు బ్రదర్! డబ్బుతో ప్రేమా, అభిమానం కొనగలనా చెప్పు? తనవాళ్ళనుచూసిన సంతోషం నువ్వు యెంత ఖర్చుపెట్టినా వస్తుందా? పండగ పిలుపులూ, ముచ్చటలూ అందరికీ జరగవు. తనకెవరూ లేరని ప్రతీ పండుగకీ మా ఆవిడ ముఖం చిన్నబుచ్చుకుంటూవుంటే నాకెంత బాధగా వుంటుందో తెలుసా? వచ్చిన అవకాశాన్ని నువ్వు జారవిడుచుకుంటున్నావు. నామాట విను. వెళ్ళు. డబ్బున్నంత మాత్రంలో అన్ని సరదాలూ తీరవు.'' అన్నాడు సుందరం బోధపరుస్తూ. రామారావు ఆలోచనలో పడ్డాడు. మౌనం దాల్చాడు. సుందరం నిష్క్రమించాడు.

3

రేపే పండుగ. ఈవాళవరకూ జానకి ఓపికపట్టి వూరుకుంది. ఆమె ముభావంగా వుండడం అతను సహించలేకపోయాడు. ఆమెను ఉత్సాహపరచాలని ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఫలితం శూన్యం. అతను ఆలోచనలో పడ్డాడు. సుందరం అన్నట్టు తనవాళ్లని చూడడమే పండుగ కాబోలు! ఆ ఆనందం తను యితరత్రా యెలా బహూకరించినా ఆమె పొందదు కాబోలు! సరే. రేపే బయల్దేరాలయితే. ఎలా? రానని వాళ్లకి రాసేశాడు. జానకి మళ్ళీ అడిగినా బాగుండేది... అతని ఆలోచన ఫలించింది. ఆమె దీనంగానే అర్థించింది. అతనంగీకరించాడు. జానకి ఆనందానికి పట్టపగ్గాల్లేవు.

4

తెల్లవారింది. జానకి హుషారుగా ప్రయాణానికి తయారైంది. రిక్షా వాకిట్లో నిలిచింది. దంపతులను స్టేషనుకి సాగనంపడానికి సుందరం వచ్చాడు. రామారావు యింటికి తాళంవేసి రిక్షాలో కాలు పెట్టాడో లేదో, పోస్ట్ మేన్ ఉత్తరం అందించాడు. రామారావు చదివి భార్య కిచ్చాడు. ఆమె చదివి నిరుత్సాహంతో అతనికే అందించి, రిక్షాదిగి, "తలుపు తియ్యండి" అంది, ఆపుకుంటున్న ఏడుపు స్వరంతో.

సుందరం తెల్లబోయాడు. రామారావు చేతిలోని ఉత్తరం తీసుకుని చదువుకున్నాడు. అందులో యిలావుంది.

"చి॥ అల్లుడు రామారావుకి మీమామ ఆశీర్వచనములు చేసి వ్రాయునది:-

నీవుత్తరం అందింది. శెలవు దొరకనందుకు చాలా విచారంగావుంది. మీరు రానందుకు మాకు సంతోషంగా వుండదు. ఈరోజు మా బావమఱది పనివుండి వచ్చాడు. ఈసంగతి తెలిసి నన్నూ, మీ అత్తగారిని వాళ్లయింటికి రమ్మని తీసుకెళ్తున్నాడు. తిరిగి వచ్చేటప్పుడు అక్కడ దిగి నిన్నూ అమ్మాయినీ చూస్తాం.''

ఉత్తరం చదివిన సుందరానికి నవ్వాలో యేడవాలో తెలియలేదు. మౌనంగా యింట్లోకి వెళ్తున్న రామారావు దంపతుల నదోలాచూస్తూ, నిలబడివున్న రిక్షా యెక్కి పదమని సంజ్ఞచేశాడు. రిక్షా కదిలింది.

# యుద్ధం లేనంతమాత్రాన శాంతి ఉన్నట్లు కాదు

## మానవుని సుఖజీవనం శాంతికి గీటురాయి

( మిస్ మార్తా ఐ. బరన్స్ )



ఈయేడు దీపావళి వేడుకల సమయంలోనే ఐక్యరాజ్య సమితి జన్మదినోత్సవం కూడా రావటం విశేషం. దీపావళి ప్రాముఖ్యత గొప్పది. అది దుష్టశక్తులపై శిష్టశక్తుల విజయానికి చిహ్నం. ప్రపంచంలో, శాంతిజ్యోతులను, శాశ్వతంగా వెలిగేటట్లు చేయటానికి ఐక్యరాజ్య సమితి అవిరామంగా కృషి సలుపుతున్నది. మన ఆనందానికి దీపాలే కారణం. దీపాలు వెలిగించేటప్పుడు శ్రామికుడు మహదానందంతో ఇల్లు చేరుకుంటాడు. జ్యోతులు గృహిణి కర్తవ్యాలమీద, విద్యార్థి పుస్తకాలమీద కాంతి ప్రసరింపచేస్తవి. రాత్రులందు పిచ్చాపాటి చెప్పుకొనే స్నేహితులకు వెచ్చదన మిచ్చేది దివ్వెలే. శాంతి చిహ్నం జ్యోతి, అశాంతికి చిహ్నం అంధకారం. యుద్ధమేఘాలు కమ్మినప్పుడీ దిపాలు రెపరెప కొట్టుకుంటవి. అయితే ఇప్పుడా భయంలేదు. బహుశా ఎప్పటికీ యుద్ధభయం ఉండకపోవచ్చు. ఏమైనా నేడు మనకు భయంకర యుద్ధ ప్రమాదమేదీలేదు. ఆ ఘనత అందరితోపాటు ఐక్యరాజ్య సమితికి దక్కుతుంది.

దేశాలు పరస్పరం పోట్లాడుకోకుండా సరిహద్దు తగాదాలు పొటమరించకుండా సమితి కట్టుదిట్టాలు చేసింది. ఇటువంటి ఏర్పాట్లే లేకపోయినట్లయితే ఇప్పటికి ప్రపంచంలో ఎంత బీభత్సం జరిగి ఉండేదో!

సూయజ్ యుద్ధ నివారణలో, సూయజ్ కాలువలో మునిగిన నౌకలను ఇతర పూడికను తీయించటంలో, సమితి అత్యయిక దళంచేత పనిచేయించటంలో, జోర్డాన్, లెబనాన్‌లనుండి సేనల ఉపసంహారణలో సమితి ప్రశంసాత్మక భూమిక నిర్వహించింది. అటువంటి అత్యవసర పరిస్థితులనుండి బయటపడటంలో సమితి మనుగడ ప్రత్యక్షంగా గానీ పరోక్షంగాగానీ ఎంతగానో ఉపకరించింది.

దేశదేశాలమధ్య వివాదాల శాంతియుత పరిష్కారానికి, యుద్ధాల నివారణకు, మానవస్వత్వాల రక్షణకు సమితి జరిపే బృహత్తర కృషివిషయం అట్లా ఉంచి, ప్రపంచ సౌభాగ్యానికి ప్రజల సౌఖ్యానికి ఈ ప్రపంచ సంస్థ పైకి చెప్పుకోకుండా నిరాడంబరంగా చేస్తున్న గొప్ప కృషిని గురించి కూడా తెలుసుకోటం అవసరం.

యుద్ధాలు జరగనంత మాత్రాన శాంతి ఉన్నట్లు భావించటానికి వీలులేదు. శాంతి అంటే మానవుని సుఖజీవనానికి అవసరమైన అన్ని హంగులు - గృహమూ, కుటుంబమూ, పనిపాటలు, బంధు, మిత్రులూ, యాత్రలూ నాటకాలూ సమకూర్చుకోటం - వంటివి అమరి ఉండటం. ఆదర్శ ప్రపంచంలో మానవుడు సుఖప్రదంగా జీవించటం ఎట్లా? నేడు మనం ఆదర్శ ప్రపంచానికి ఎంతో దూరంలో ఉన్నాము. నిజమైన శాంతి మనకు ఇంకా చాలా దూరంలో ఉన్నది. యుద్ధం అనేది లేకపోయినా శాంతి దాపులోలేదు. మానవసమాజంలో క్షుద్బాధ, అనారోగ్యం, అజ్ఞానం తాండవిస్తున్నంతకాలం, మానవకోటి కేవలం బ్రతకటానికి బ్రతుకు సాగిస్తున్నంత కాలం నిజమైన శాంతి ఉన్నదనజాలము.

### సమితి శాంతి కృషి

సుఖ సంపదలతో కూడిన శాంతిస్థాపనకు ఐక్యరాజ్య సమితి తన సభ్యదేశాల సహకారంతో అహరహం పాటుపడుతున్నది. "ఐక్యరాజ్య సమితిలోని మనము ప్రాథమిక మానవస్వత్వాలపట్ల, మానవుని గౌరవం, విలువలు పట్ల, స్త్రీ పురుషుల, చిన్న, పెద్ద దేశాల సమానహక్కులపట్ల మన విశ్వాసాన్ని పునరుద్ఘాటించటానికి, సాంఘికాభ్యుదయం, ప్రబల జీవిత ప్రమాణాల అభివృద్ధి సాధనకు కృతనిశ్చయులమై ఉన్నాము" అని సమితిప్రణాళిక ప్రవచిస్తున్నది. సమిష్టిలక్ష్యాల సాధనకు అన్నిదేశాల కృషిని సమన్వయపరచే కేంద్రమే ఐక్యరాజ్య సమితి.

పదమూడేళ్ల సమితి చరిత్రలో సామాన్యమానవుని హక్కులను గుర్తింపజేయటానికి శక్తివంచన లేకుండా అది కృషిచేసింది. వీలైనచోటెల్లా ఈ హక్కులను న్యాయశాసనంగా పరిగణింపజేయగలిగింది. నిరాఘాటంగా విశ్వమానవ స్వత్వాల ప్రకటనను రూపొందించి దాన్ని అందరిచేత పరిగణింపజేసింది. అది నైతిక శక్తిగల ఒక మహత్తర పత్రం.

శరణార్థులకు కొత్త నివాసగృహాలు సమకూర్చటానికి, అందరితో కలిసిమెలిసి జీవింపగల పరిస్థితులు కల్పించటానికి సమితి ఎంతగానో తోడ్పడింది. ఈ

సంవత్సరాన్ని ప్రపంచ శరణార్థుల సంవత్సరంగా ప్రకటించింది.

కొత్త స్వతంత్ర రాజ్యాల అవతరణకు, వాటి మనుగడకు సమితి తోడ్పడింది. వచ్చే సంవత్సరం సోమాలి లాండ్ ఫ్రెంచి కామరూన్స్ స్వతంత్ర రాజ్యాలుగా అవతరించి సమితి సభ్యదేశాలు కానున్నవి. ఇంకా కొన్ని స్వతంత్రరాజ్యాలు అవతరించవచ్చును.

## అభివృద్ధి కృషి

నూతనరాజ్యాలు బడుగుదేశాలు స్వయంసమృద్ధం కావటానికి, తమతమ ప్రభుత్వ వ్యవస్థలను ఆర్థిక వ్యవస్థలను సుస్థిర పరచుకోడానికి, సాంకేతిక పురోభివృద్ధి సాధించటానికి సమితి తోడ్పడింది. సమితి సరాసరిగానూ, తన అధీన సంస్థలద్వారానూ మాతా శిశురక్షణకు ఔషధాలు, ఆహారం శీఘ్రకాలంలో సరఫరా చేసింది.

సమితి కారుణ్యదృష్టితో లక్షలాది మానవుల బాధలు తీర్చటానికి వారికి సౌఖ్యపథం చూపెట్టటానికి ఆయా ప్రభుత్వాలు ప్రతినిధులతో సమావేశాలు సమాలోచనలు జరపటంద్వారా అపారకృషి సల్పింది. తద్వారా ప్రపంచంలో "సాంఘిక చైతన్యానికి" రాచబాట నిర్మించగలిగింది.

అయితే సమితి ఎంతచేసిందో - చేయవలసింది ఇంకా అంత ఉన్నది. సంఘటితమౌతున్న నాగరీకమౌతున్న సమాజాన్ని ఇంకా సమస్యలు పట్టి పీడిస్తూనే ఉన్నవి. అదేవిధంగా ఐక్యరాజ్య సమితికి నిరంతర సమస్యలు ఎదురౌతూనే ఉన్నవి. ఎల్లప్పుడూ ఎదురౌతూనే ఉంటవి.

బలవర్థక ఆహారం తరుగుప్రాంతాలకు ఆహార పదార్థాల సరఫరా, అస్థిమిత ఆర్థిక పరిస్థితులలో చిక్కుకోని విధంగా సుస్థిర ద్రవ్యపద్ధతి, వస్తువుల విలువ, స్వాతంత్ర్యం, స్వయం పరిపాలనకోరే ప్రజల సమస్యలకు న్యాయమైన, ఆచరణసాధ్యమైన పరిష్కార మార్గాలు అన్వేషించటము నేడు క్లిష్టమైన వ్యవహారం.

## భావిపౌరుల రూపకల్పన

మనమందరం నేర్చుకోవలసిన మరొక కష్టసాధ్యమైన పాఠం సహకారం. ఈ ప్రపంచంలో ఎట్లా మసులుకోవలెనో కుటుంబంలో ఎలా వ్యవహరించాలో బాలలకు పసితనంనుంచే నేర్పాలి. మానవజాతికి ఇది అతిముఖ్యవిషయం. వ్యక్తుల అనుభవాలు దేశాల అనుభవాలు - రెండూ పూర్తిగా సదృశమైనవి కావు. అయితే వ్యక్తుల అనుభవాలను తగినంత ప్రమాణానికి విస్తృతమయ్యే విధంగా అనువర్తింపజేయవచ్చును. ఇతరులకు సేవ చేయటంలోనే వ్యక్తికి వాస్తవమైన ఆత్మానందం కలుగుతుందని పెద్దలు నిరూపించారు. కుటుంబంకోసం త్యాగంచేసిన తల్లి అంతస్థు పెరుగుతుందేకాని తరగదు. అల్లాగే ఐక్యరాజ్య సమితికి సహాయపడిన దేశాలు అనిర్వచనీయమైన ప్రతిఫలతృప్తి పొందగలవు. మానవకోటి సహకారం ద్వారా పురోగమించింది. తొలుత కుటుంబంగానూ, తర్వాత తెగగానూ, ఆపైన గ్రామంగాను తర్వాత నగరంగానూ, రాష్ట్రంగానూ, దేశంగానూ ప్రవర్ధమానమైంది. ఐక్యరాజ్య సమితి ఆఖరి లక్ష్యంగురించి విభిన్నాభిప్రాయాలున్నవి. అయితే ప్రపంచ శాంతిస్థాపనకు ఈ మహాసంస్థ అంతర్జాతీయ సహకారానికి అవకాశం కల్పించినంతవరకు దీని మనుగడ అత్యావశ్యకమే.

## సమష్టి మేధ

దేశదేశాల విజ్ఞులు ఈ మహాసంస్థ వేదికమీద సమావేశమై నేటితరం సమస్యలైన నిరాయుధీకరణ, అంతరిక్షాన్ని శాంతి ప్రయోజనాలకు వినియోగించటం మానవజాతి సంక్షేమానికి పరమాణుశక్తి వినియోగించటం, అంతర్జాతీయ వాణిజ్యవిస్తరణకు అవకాశాలు కల్పించటం, కొన్ని జీవితావసరవస్తువుల ధరలు స్థిరీకరించటంవంటి విషయాలను గురించి చర్చిస్తున్నారు. తత్ఫలితంగా విజ్ఞతాపూర్వకమైన సమష్టి ప్రయోజనాలు సిద్ధించగలవు. అదే "సమష్టి విజ్ఞత", "సమష్టి వివేకము", "ఒకరికంటే ఇద్దరు మేలు" అనే నానుడి ప్రకారం ఈ విజ్ఞులైనవారంతా విజ్ఞతా పూర్వకమైన ఆలోచనలు చేస్తున్నారు.

సమష్టి విజ్ఞత గురించి మాట్లాడినప్పుడు ఐక్యరాజ్య సమతికి వర్తించే మరొక ప్రయోగాన్నికూడా చెప్పుకోటం అవసరం అది "సమయస్ఫూర్తి" కొన్ని క్లిష్టపరిస్థితుల్లో సమితి సమయస్ఫూర్తితో వ్యవహరించి తన పలుకుబడిని, ప్రతిష్ఠను పెంచుకోగలిగింది. ఈ "సమయస్ఫూర్తి" సమితి సెక్రటరీ జనరల్ డాగ్ హామర్ షెల్డ్‌లో కూడా కనిపిస్తుంది. సెక్రటరీ జనరల్ గా ఆయన సమితి నిర్మాణంలో కీలకస్థానం ఆక్రమించి ఉన్నారు.

(మద్రాసు ఆర్ట్సు కళాశాలలోచేసిన ప్రసంగంలోని ముఖ్యభాగాలు కూర్చిన వ్యాసం)

—)o)—

# మన నాటకం

## [పంచ వర్ష ప్రణాళికలు]

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

---------

(గతసంచిక తరువాయి)

## రెండవరంగం

[ప్రదేశము :- సంపన్నరైతు బంగారయ్య గృహము.

ప్రవేశము :- సంపన్నరైతు బంగారయ్య, రైతుకూలీ రాఘవయ్య ]

రాఘవయ్య:_బంగారయ్యగారూ! మావంటి పేదలను మీవంటి ధనవంతులు రక్షింపకుంటే ఎలా ?

బంగారయ్య:_రాఘవయ్యా! దేవుడున్నాడులే! మేమేమి చేయగలం ?

రా:-నిన్నటినుంచి గంజిలేక పిల్లలతో ఆకటికి నకనకలాడుతూన్నాము. ఒకబస్తా ధాన్యమిచ్చి కాపాడండి !

బ:_పైకము తెచ్చావా ?

రా _అప్పుగా యివ్వండి! లక్షాధికారులు రక్షించండి !

బ:-రాఘవయ్యా! నీకు ఋణం ఎలా లభిస్తుంది. నిరుపేదవు. ఋణము తీర్చలేవు. వెళ్లు. ఇంకెక్కడనైనా ప్రయత్నంచేయి.

రా:_గ్రామంలో ధనంకలవారే యిట్లంటే యింకెక్కడ ప్రయత్నించేను! చేతులు కట్టుకొని మీది తీర్చివేస్తాను. రక్షించండి ! _ రక్షించండి !

బ:_లేనివాడ వెట్లు తీర్చగలవు ? — ఇంక వెళ్లు.

రా:-కూలిచేసి తీర్చుకొందును.

బ:ఇప్పుడు మనగ్రామములో కూలిపన్నులు లేవే! అయినా యిక్కడ నీవు వుంచినదేమీ లేదు. వేరొకచోట ప్రయత్నించుకో.

రా:_ఏడాదికి కొన్నివేల బస్తాల ధాన్యం మీకు రాబడి వస్తూంది. మావంటి పేదలకు కొద్దిబస్తాలు అప్పుగా యిచ్చి కాపాడలేరా ?

బ:-మీవంటి పేదలకు ఋణములు యీయలేము.

రా:-ఇది ప్రజారాజ్యము. ఇంక ధనవంతుడు, పేదవాడు అను భేదములేక సమానత్వమును ప్రకటించే కాలము వచ్చింది. ఎందరు జమీందారులు ఆనందముగా వారి వారి జాగీరులను ప్రభుత్వ వశము జేశారు! ఒక్కరైనా జమీందారీ సమర్పణలో వెనుకడుగు వేశారా ?— ఎందరు మహా దాతలు పూజ్య వినోబాభావేగారికి భూదానం చేయుచున్నారు.

బ:_ఎందుల కిచ్చట వారి ప్రసక్తి ? మాకుధనంవుంది. మేము హాయిగా అనుభవిస్తాము. మీకు యేమీ యీయము.

రా:_బంగారయ్యగారూ! మీ గ్రామములోని పేదలు కష్టాలతో కలవరపడుతూంటే మీకు కనికరము కలుగదా ?

(— తెరలో పాట )—

చెలో! చెలో! వీధులు ఊడ్చుదాం!

బోధలు చేద్దాం! చెలో! చెలో!

బ -రాఘవయ్యా! ఏమిటా కోలాహలం ?

రా:_మన మాధవయ్య పంతులుగారు—

బ:_బడి పంతులా ? —

రా:-ఔను, గ్రామసేవకై నడుముబిగించి గ్రామ వీధులు ఊడ్చుతూన్నారు.

బ:_చదువుకొన్నందు కిదా ఫలం; పాకీపనులుకూడా చేయడమేనా ? బాగు, బాగు.

రా:_మన పిల్లలుకూడా కలిసి మనకు నీతి నేర్పుతూన్నారు. ఆవంక చూడండి! ఇటే వచ్చుచున్నారు.

మాధవయ్య:_[కొందరు విద్యార్థులతో ఊడ్చుతూ ప్రవేశించును. ]

—( పాట )—

చెలో! చెలో!
వీధులు ఊడ్చుదాం!
బోధలు చేద్దాం!
చెలో! చెలో!
గ్రామసేవయే ప్రేమ సేవయని
సేమము - తలపోద్దాం '
మురికీ - చెత్తా - పెరికి పూడ్చుదాం!
బెరుకు హృదయములు తరిగేద్దాం!
సమాజ సేవలు సలుపుట కొరకై
సమత్వ తత్త్వం ప్రకటిద్దాం!
పురికీ, వ్యక్తికి దారి చూపుదాం!
పౌరధర్మములు గురిపిద్దాం!

బ:_మా అబ్బాయి గోపాలమునుకూడ మాధవయ్య యిందులో చేర్చాడా? (మాధవయ్య వద్దకు త్వరగాపోయి)— మాధవయ్యా! ఉపాధ్యాయుడవై యుండి మా ధనవంతుల బిడ్డలచేగూడా పాకీపనులు చేయుస్తున్నావా? నీకు బుద్ధిలేదా? చాలించు. (మాధవయ్యను కొట్టబోవును).

గోపాలం:-(అడ్డు నిలిచి) నాన్నా! నాన్న! అయ్యవారిని కొట్టకుము. నన్ను కొట్టుము, నన్ను చంపుము.

రా:_[బంగారయ్యను వారించి] బంగారయ్యగారూ! ఆగండి, ఆగండి! అయ్యవారిని దండింపరాదు. ఆయన సమాజసేవ చేస్తూన్నారు.

బ:_రాఘవయ్యా! నన్ను విడువుము. ఈ మాధవయ్యను మట్టిలో పూడ్చివేస్తా!

గో:_నాన్నా! నాన్నా! నా పలుకులు వినుము.

బ:_నీవు యీపని విడిచి యింటికిపో!

గో:_నాన్నా! ఈ గ్రామ మెవరిది?

బ:_మనది.

గో:_ఈ వీధు లెవరివి?

బ:_మన గ్రామస్థులవి.

గో:_ఇక్కడి ప్రజలెవరు?

బ:_మన గ్రామప్రజలే!

గో:_నాన్నా! ఈ గ్రామము మీయొక్కరిది కాదు గదా? మన అందరిప్రజల గ్రామం.

రా:_బంగారయ్యగారూ! అయ్యవారు తనస్వార్థం కొరకు యీపని చేయలేదు. మన గ్రామస్థులందరి కొరకు సేవజేసి పౌరధర్మమును జూపుతూన్నారు.

మా:_బంగారయ్యగారూ! సమిష్టిగా మనమీ పల్లెపట్టులో సంఘజీవనమును సలుపుచున్నాము.

తే||గీ|| మనము, మనయిల్లు, మనయూరు। మనదు దేశ
మన్ని విధముల నభివృద్ధి। గన్న యటుల
కృషిని సలిపిన యప్పుడే। కేవలముగ
సౌఖ్యమగు జీవనమ్మును। సలుపగలము.

మనము, మనగ్రామము, మనదేశము బాగుపడుటకు మనమెన్నియో మంచికార్యములు చేయవలసి యున్నవి. నేడు ప్రభుత్వాదరణము వలన ఎన్నో గ్రామములు చైతన్యముపొంది, ఎన్నో సంఘాభివృద్ధిగల సత్కార్యములు సలిపి, ఎంతో ఆనందమున ఓలలాడుచున్నవి. ఆయా పల్లెలందలి ప్రజలు ఐకమత్యము, ఒర్పుకలిగి నైతికముగాజీవన ప్రమాణమభివృద్ధి జేసికొని హాయిగానున్నారు.

బ._మాధవయ్యగారూ! నా యపరాధములను మన్నించండి! మీ పలుకులు వినుటకు ఆనందముగా నున్నవి.

మా:_పలుకులవలన లాభము కలుగదు. పలుకులతో పనులుచేసి మన పల్లెటూరిని బాగుపరుచుకొనుటకు మన నాటకమెంతేని యున్నది.

రా:_ఎన్నో గ్రామసీములు స్వర్గసీమలైనవని వింటున్నాము. మాకు కర్తవ్యమును బోధించండి!

మా:_మనగ్రామము మనము బాగుచేసుకొనగలము. రోడ్లు వేసికొనగలము. బావులు నిర్మించగలము. చెఱువులు అభివృద్ధి చేసుకొనగలము. పాఠశాల భవనములు నిర్మించుకొనగలము. పఠన మందిరములు నెలకొలపగలము. మరియు, మనకు కావలసిన ప్రతిసాముదాయక కార్యమును చేసికొనగలము.

రా:_వీటన్నిటికి ఎంతో పైకము కావలెనే! ఎందరో బీదకుటుంబములో నారు గ్రామములనున్నారే!

మా:_ఇట్టి కార్యములకు మన మొక భాగమును సహాయపడిన ప్రభుత్వము కొన్ని భాగములకు సహకారముచేయును. మన భాగమునకు శ్రమదానము చేయవచ్చును. వస్తురూపేణా యీయవచ్చును. ధనరూపేణా యీయవచ్చును. మన సహాయమును విలువకట్టి ఆయా కార్యములకు రెండు మూడు రెట్ల ధనము ప్రభుత్వమిచ్చును. మన ధనమూ, ప్రభుత్వధనము కలిసి మన గ్రామకార్యాలకే వినియోగపడుచున్నది. కనుక, కూలీలు మొదలగువారికి కొంత పనికలిగి ధనము లభించుచున్నవి. మనగ్రామ మభివృద్ధిపొంది సౌకర్యాలు కలుగుచున్నవి.

రా:_సరే, ప్రభుత్వమే యీ కార్యాలు చేయరాదా? మనమేల భాగము కలుపవలెను?

మా:_మనభాగము కలుపుటవలన, మనకార్యము మనమే చేయుటవలన ఆ కార్యమునందు బాధ్యత కలుగును. ధనము దుర్వినియోగము కాదు. తృప్తికరమైన ఫలితమును పొందగలము.

రా:_ఈ సమిష్టి విధానమెంతో బాగున్నది.

మా:_మనము తలంచినట్లయిన ఎన్నో కార్యములు సులభముగా చేయగలము. ఒకరోడ్డు వేయవలెననుకొనండి! ఆ కార్యములో అందరము పాల్గొని తలా ఒకతట్టెడు మట్టిని పోయగలము. ఒక్కొక్క తట్టెడురాళ్లను పోయగలము. ఆ కార్యము నత్యంత జయప్రదముగా చేయగలము.

బ:_ఔనే! బాగు, బాగు. ఈ ఆశయాలన్నీ మన అభివృద్ధికి తోడ్పడవచ్చును.

మా:_పంచవర్ష ప్రణాళికలని ప్రభుత్వము తలపెట్టినది. అప్పుడే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనది. ఈ ప్రణాళిక కొరకు 4,800 కోట్ల రూపాయలు ప్రభుత్వము ఖర్చు చేయుచున్నది.

రా:_అయిన మనము ధన్యులమే!

మా:_ప్రజలకు పరిపూర్ణ జీవితావకాశాలు కలిగించుచున్నది. అధికోత్పత్తి, బాహుళ్యముగా ఉద్యోగావకాశాలు కల్పించుచున్నది. ప్రజల ఆదాయమునందు, సంపదలయందు గల వ్యత్యాసములను తగ్గించి, ఆర్థికశక్తిని సమానముగా పంచిపెట్టుటకు సంకల్పించినది.— ఆహారములోను, వస్త్రములలోను, గృహములలోను, వైద్య-విద్యావసతులలోను అభివృద్ధి చూపుతుంది. మరియు, ప్రజల కనీసావసరాలు తీర్చి ప్రతివ్యక్తీ అభివృద్ధి చెందుటకున్నూ; జాతీయాదాయము పెరుగుటకున్నూ ప్రభుత్వము తలపోసినది.

బ:-మనకే? — మన పల్లెటూళ్లకు సంక్రమించునా?

మా:_ఔను, మనకే!

సీ॥ అన్ని రకములైన । చిన్న పెద్దగు నీటి
వసతుల నభివృద్ధి । పరచుటకును,
జాతీయ, రాష్ట్రీయ । సకల రస్తాల సౌ
కర్యాలు భారీగ । కలుగుటకును,
సాంఘిక సంక్షేమ । సౌఖ్యమ్ము లమరించి
స్థానిక కార్యాలు । చక్కబరుప,
ఉత్పత్తి నెలకొల్పి । యుద్యోగములు కూర్చి
ప్రజల యాదాయమ్ము । ప్రబల జేయ,
తే॥గీ॥ విరివి బొందగ జాతీయ । విస్తరణకు
సేవ లొనరింప కేంద్రాలు । సిద్ధపరచి
పల్లెపట్టుల స్థాయిని । బాగుపరుప
మన ప్రణాళిక రూపొందె । మాన్యులార!

రా:_మనము, మహాధన్యులము.

— (పాట) —

స్వతంత్ర దేశము మనదే నోయ్!
స్వతంత్ర ప్రజలము మనమే నోయ్!
మన దేశములో! మన గ్రామములో!
మనమే నోయీ! ధన్యులము!
అహా! మనమే నోయీ! ధన్యులము!
ప్రణాళికలు మన
వినాశ రోగము
ననాయాసముగ
నణగ ద్రొక్కను!
మన ప్రజలందరి జీవనప్రమాణ
మాహా! అహా! యధికంబగుగా! ॥స్వతం॥

మా:_ అంగబలమ్మును । ఆయుధమ్ముతో
అశక్తతను దునుమాడగ జేసి,
వ్యక్తి ప్రయోజన మారయుచుండి ।
సమిష్టి - ప్రయోజన మారయుచుండి ।
శక్తి కొలందిగ పాటుబడాలోయ్!
స్వతంత్ర దేశము మనమే నోయ్!
స్వతంత్ర ప్రజలము మనమే నోయ్!

బ:-మాధవయ్యగారూ! ధనవంతులు, ధనహీనులు అన్న భేదభావము నాకు పూర్తిగా మానినది. మనకు కావలసిన సాంఘిక కార్యాలలో పాల్గొనుచున్నాను.— గ్రామసేవకు మీ కంతరాయము కలిగించితిని. నేటికీకార్యము పూర్తిజేసి యింక కర్తవ్యమును ప్రారంభింతము.

[మలారమును చేతబట్టి ఊడ్చుటకు ప్రారంభించును.]

రా:_బంగారయ్యగారూ! మీరీస్థితికి వచ్చెదరని నేను తలంచియుండలేదు. మహానందం!

[మలారమును చేతనుబట్టి ఊడ్చుటకు సిద్ధపడును.]

అందరు:_(ఊడ్చుతూ).

— (పాట) —

చెలో! చెలో! వీధులు ఊడ్చుదాం!
బోధలు చేద్దాం! చెలో! చెలో!
గ్రామ సేవయే ప్రేమ సేవయని,
సేమము తలపోద్దాం!

[పాడుచు నిష్క్రమింతురు]

తెర ప్రాలును

(సశేషము)

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డెసయంట్-ఎక్స్‌వ్యూపేరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ

## ఇంతవరకు సాగినకథ

[ రాజకుమార్ ఈలోకపు వాతావరణాన్ని అవగాహనం చేసుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ వున్నాడు. దాంతో అబ్బాయి ఇంతవరకూ కనీవినీ సమస్యలనెన్నిటినో ఎదుర్కోవాలసి వస్తున్నది. నక్క అబ్బాయికి ఈలోకపు కోవలని కొంతవరకు పరిచయంచేసింది. అక్కడినుంచి గులాబితోటలోకి వచ్చాడు. గులాబిపూల కోవనిచూస్తూ విస్తుపోతూ వున్నాడు. ఇక చదవండి. ]

అబ్బాయి అన్న ఆమాటతో గులాబి పూలు సిగ్గుపడిపోయాయి.

"మీరు అలా సిగ్గుపడతారెందుకు? చూడటానికి ఎంతో అందంగా వున్నారు. కాని లోపలంతా శూన్యం. ఎంతోమంది ఇటుకేసి నడుస్తూవుంటారు. వాళ్లల్లో ఎవళ్లయినా ఫలానిరోజా నా రోజాకి సమానంగానే వున్నదని అన్న పాపానబోయారా? మొక్కని నాటి, ఎరువువేస్తూ, నీళ్లుపోస్తూ, కలుపుతీస్తూ, వెయ్యికళ్లతో దాని పోషణను చూస్తూవుండే వాళ్లకే ఈరహస్యం చక్కగా అర్థమవుతుంది. నారోజా మీ జాతిదే. దానిని పెంచి పెద్దచేయటానికి పడ్డకష్టాలు నాకు తెలుసు. గాలిమూలాన దెబ్బ తగులకుండా వుండటానికి నలుప్రక్కలా దడులని కట్టాను. నాకు నచ్చిన ఏ రెండుమూడు సీతాకోక చిలుకలని తప్ప మరేపురుగులని అటుకేసి రానీయకుండా చేయవలసిన కట్టుదిట్టాలని చేశాను. నా కష్టనిష్ఠూరాలని దానితో చెప్పుకుంటూ వుండేవాణ్ని. అది తన గోడవని నాతో చెప్పుకుంటూ వుండేది. అంచేత అది నా రోజా పువ్వు..." అని అంటూ అబ్బాయి అక్కడనుంచి తిరిగీ తన నేస్తం నక్క దగ్గరికి వచ్చాడు.

♦ ♦ ♦

"ఇక నేను వెళ్లిపోవచ్చా!" అని నక్కని ప్రశ్నించాడు అబ్బాయి ఆదుర్దాతో.

"వెళ్లిపోవటం అవసరం అయితే అడ్డురావటం తప్పుగా? తప్పక వెళ్లిపో నువ్వు అనుకున్నచోటికి. చెప్పుతానన్న రహస్యం ఇదే: దీనిని అర్థం చేసుకోటం అంత బ్రహ్మాండం కాదు. చూడటానికి మనిషి మంచివాడుగానే కనబడుతాడు. కాని ఆ మనిషిలోని నిజాయితి కళ్లకి మాత్రం కనబడదు." అని అన్నది నక్క.

"నిజాయితి కళ్లకి మాత్రం కనబడదు" అని నక్క అన్న మాటలనే గట్టిగా వల్లించాడు అబ్బాయి వాటిని మరచిపోకుండా వుండటానికి.

"నువ్వు నీరోజా మొక్కకి వినియోగించిన కాలం ఎంతో ముఖ్యమైంది. అంచేతనే ఆ రోజాపట్ల నీకంత మమతవుంది."

నక్క అన్న మాటలనే అబ్బాయి

మరొకసారి వల్లించాడు, అవి తనలో గట్టిగా నాటుకోటానికి.

"మనుషులు ఈ సత్యాన్ని పూర్తిగా మరచిపోయారు. నువ్వుమాత్రం ఎలాంటి పరిస్థితిలోకూడా మరచిపోవద్దు. నీ రోజుని పెంచటానికి వినియోగించి కాలం వ్యర్థమైందని అనుకోవద్దు. అది నీదైపోయింది. దాని భారమంతా నీమీదే పడ్డది..." అని అన్నది నక్క.

"అది నాది. దాని భారమంతా నా మీదే వుంది..." అని తిరిగి అంటూ నక్కదగ్గర సెలవు పుచ్చుకొని మన రాజకుమార్ గబగబ వెళ్లిపోయాడు.

II

"ఏమయ్యోయి! నమస్కారం!" అన్నాడు రాజకుమార్.

"ఆ! నమస్కారం!" అన్నాడు రైలు సిగ్నల్ల గొడవనంతా చూసుకుంటూ వున్నాయన. ఒకక్షణం అబ్బాయి కేసి చూస్తూ జవాబిస్తూ మందహాసంచేస్తూ.

"ఇక్కడ నువ్వుచేస్తున్న పనేమిటి?" అని అడిగాడు అతను యాంత్రికంగా చేస్తున్న పని కేసిచూస్తూ ఆశ్చర్యపడుతూ.

"ప్రయాణీకులని వేలకొలది పెట్టెలలో ప్యాకుచేయటం. అలా ప్యాకుచేసిన పెట్టెలని ఇంజనులకి తగిలించటం. అలా ఇంజనులు లాగుకొనిపోయే బండ్లని, ఇటు కుడివైపుకి అటు ఎడమవైపుకి పంపటం నా పని......" అని ఆ మనిషి తన కార్యకలాపాన్ని అబ్బాయికి వివరిస్తూ వున్నాడు.

ఆ సమయంలోనే ఉరుములకిమల్లె రణగొణ ధ్వనిచేస్తూ అటుకేసి మెయిలుబండి వేగంగా వెళుతూవుంది.

"ఎందుకలా వేగంగా ఆరైలు వెళ్లాలి? ఇంతకూ ఎటుకేసి అది వెళ్తూవున్నట్లు?"

"ఆ సంగతి ఇంజను నడిపే మనిషికి కూడా తెలియదు." అని ఆ మనిషి అన్నాడు.

ఇంకోక్షణంలో ఆ మెయిలుబండికి మించిన ఎక్స్ప్రెస్‌బండి ఇంకోవైపునుంచి గబగబ దొర్లుకుంటూ పోతున్నది. దాని శబ్దం సంగతి ఇక చెప్పాలా?...

"ఆ బండే తిరిగి ఇటు వస్తున్నట్లు వుందే?" అని విస్తుపోతూ అబ్బాయి అడిగాడు.

"అప్పుడు వెళ్లిన రైలుబండి వేరు. ఇప్పుడు వెళ్లినది వేరు."

"అంత వేలంవెర్రిగా అటుకేసి అంత మంది ఇటుకేసి ఇంతమంది వెళ్లట మెందుకో మరి?"

"ఇటూ అటూ తారట్లాడుతూ వుండటమంటే వాళ్లందరికీ ఎంతో సరదా. అటువంటివాళ్లు ఒకచోట నిలకడగా వుండమంటే వుంటారా?!" అని ఆ మనిషి అన్నాడు.

మరికొన్ని నిమిషాలకి ఇంకో ఎక్స్ప్రెస్ రైలుబండి ముందటి వాటికన్న ఎక్కువ వేగంగా దొర్లుకుంటూ పోయింది.

"ఈరైలు ఇటుకేసి వెళ్లిపోయిన బండిని చేరుకోటానికేనా ఇంత హడావుడిగా దూసుకుని వెళ్లటం?"

"అది చేరుకునేచోటు వేరు. ఇది చేరుకునేస్థానం వేరు. లోపల వుండేవాళ్లు హాయిగా నిద్రపోతుంటారు. లేదా ఆవలిస్తూ వుంటారు. పిల్లలుమాత్రం దోవలో కనబడే దృశ్యాలని చూడాలనే ఆతృతతో కిటికీలకేసి బయటచూస్తూ వుంటారు." అని ఆ మనిషి అన్నాడు.

"అంటే పిల్లలకే దోవల్లోని దృశ్యాలని చూడాలని వుబలాటం అన్నమాట! బయటి దృశ్యాలని చూడటంతో విసుకెత్తితే వాళ్లబొమ్మల్ని ఎత్తుకుని లాలిస్తూ కాలక్షేపం చేయటం అంటే పిల్లలకి ఎంతో ఇష్టం. ఆ పనిలోకూడా విసుకెత్తిందా ఇక ఏడవటానికి ప్రారంభిస్తారు.. ..."

"వాళ్లతత్వం నీకు బాగా తెలిసినట్లు వుందే" అని అంటూ ఆయన మందహాసం చేశాడు.

III

"నమస్కారమండి! నమస్కారం!" అని రాజకుమార్ అన్నాడు.

"నమస్కారం! ఆ! నమస్కారం" అని వర్తకుడు అబ్బాయికేసి వింతగా చూస్తూ తలనూపాడు.

ఆ వర్తకుని పనంతా దప్పిని అరికట్టే మాత్రలని తయారుచేయించి అమ్మటం. వారానికి ఒక మాత్రని తిన్నారా, కొంతకాలమయ్యేసరికి మాత్రలు బాగా లోపల పనిచేస్తాయి. దాహంమీద ధ్యాస ఏ మాత్రం వుండదట!

"అలాటి మాత్రలని నువ్వు అమ్మకానికి చూపటం అంత అవసరమా?" అని అతను తన మాత్రలనిగురించి చెబుతూ వున్న సంగతులని వింటూ ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు అబ్బాయి.

"అలాచేయటం అవసరం. జనం అనవసరంగా నీళ్లకోసం కాలాన్ని వ్యర్థం చేయనక్కరలేదు. ... శాస్త్రజ్ఞులు ఈ రహస్యాన్నే అవగాహనం చేసుకుని ఇలాటి మాత్రలని కనిపెట్టారు. వాళ్లకృషిని లోకం తెలుసుకోటం, దానిమూలాన లాభం పొందటం అవసరం కదూ!... వారానికి అధమము ఏభైమూడు నిమిషాలు కలిసివస్తాయి!"

"ఇలా కలిసివచ్చే ఏభైమూడు నిమిషాలని, ఆ మాత్రలని పుచ్చుకునే మనిషి దేనికి వుపయోగించుకుంటాడు?" అని సూటిప్రశ్నని అబ్బాయి ఆ వర్తకునిమీద విసరాడు.

"వాటితోనా......" ఏమి సమాధానం ఇయ్యాలో తెలియక ఆయన తికమక పడసాగాడు.

"నాకే ఆ ఏభైమూడు నిమిషాలే కలిసి వచ్చాయా, తటపటాయించకుండా తిన్నగా నూతికేసి......" అని అబ్బాయి ఏమో అనబోతున్నాడు. ఈ గొడవంతా ఆ వర్తకుడికి నచ్చుతుందా?......

(సశేషము)

కడుపునొప్పి, నోట నీరూరుట, త్రేపులు, వాంతులు, మలబద్ధకము లాంటి అజీర్ణ లక్షణములకు
కేసరి గారి
ఆదిత్య లవణము
దివ్య ఔషధము
వెల రు. 1-75 న.పై.
కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు 14.

# మతకర్తలు: తద్భక్తిభేదములు

[ పయి శీర్షికక్రింద వ్రాయఁబడిన మొదటివ్యాసము గతసంచికలోఁ బ్రచురితము. ఇది రెండవది.— కాని, యిందుఁ బ్రక్రమ భిన్నమొకింత జరిగినది. అక్టోబరు 'గృహలక్ష్మి'—లో శ్రీరామానుజుల జీవితమును గూర్చి తెలుపకయే— ఆతని భక్తినిగూర్చిన సిద్ధాంతములు ప్రకటింపించుట నావలని పొరపాటు. విశిష్టాద్వైత మతవ్యాప్తికి శ్రీరామానుజాచార్యులును వేదాంతదేశికులును మూల స్తంభములవంటివారు. కాన, ఆ యుభయుల జీవితము లించుక తెలిసికొన్నఁగాని, వారి మనోవృత్తులు, ప్రజల జాతీయ జీవితములు, కాల పరిస్థితులు తదనుసారము తటస్థించిన మతసంస్కరణములు మనము గ్రహింపఁజాలము. కాన శ్రీరామానుజాచార్య వేదాంతదేశికుల దివ్యచారిత్రములఁగూర్చి సంగ్రహముగాఁ దెలుపఁబూనితి.]

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)

## శ్రీరామానుజాచార్య జీవితము

శ్రీరామానుజుడు విద్యాసాగరుఁడు. అతని పవిత్ర ప్రవర్తనము, ప్రశాంతస్వభావము, నిష్కపట విశాల దృక్పథము హైందవహృదయమున శాశ్వతస్థాన మాక్రమించుకొన్నది. అతఁడు ఆళువందారు ఆచార్య (యామునాచార్య) సిద్ధాంతముల ననుసరించు పరమ నైష్ఠికుఁడు. అతని తండ్రి కేశవభట్టు. ఈ కేశవభట్టు, చెంగల్పట్టు మండలములోని శ్రీపెరంబుదూరున నివసించుచుండెను. కాని శ్రీరామానుజుఁడు శిశువుగ నున్నప్పుడే యతఁడు మరణించెను. తరువాత నతఁడు వేదాభ్యాసమునందిచ్ఛ గలవాఁడై, కాంచీపురమున కేఁగి, యట యాదవప్రకాశుఁడను గురువు నాశ్రయించెను. తన గురువు వేదములు మున్నగువానిలోని ప్రవచనముల కిచ్చు హేత్వాభాసమిథ్యావాదముల నతఁడు వెలివఱచునంతటి కుశాగ్రబుద్ధిని చిన్నతనము ననే కలిగియుండెను. ఇది గమనించిన యతనిగురు వాతని హతమార్చినఁగాని, తనకుఁగీర్తి దక్కదని యూహించునంతటి యసూయతనియెడ వహించెను. తన దురుద్యమము కొనసాగుట కాదేశికుఁడు, శ్రీరామానుజుని జ్ఞాతియు, సహాధ్యాయియు, అగు గోవింద భట్టుతో రహస్యముగ నాలోచించి యొకకుట్ర పన్నెను. తదనుసారము యాదవప్రకాశుఁడు "కాశీ యాత్ర" కను సాకుతో శ్రీరామానుజునిఁ బ్రోత్సహింపు మనియు, "మధ్యేమార్గమున అనుకూలమగు చోట నతనిఁ జంపుద" మనియు నాజ్ఞాపించెను. తన గురునియాజ్ఞను నెఱవేర్చుటకు శ్రీరామానుజుని బయలుదేఱదీసి, అరణ్యమునఁ బడి యరుగుచుండ— భగవంతుఁడు తాను స్వయముగ నతనిఁ గావ— ఆట విపులగు భార్యాభర్తల నటకంపెను. వారాసమయమున అట్లు అడ్డుపడియుండనిచో— శ్రీరామానుజుఁడు గోవిందుని వంచనమునకు లోనయి, తన విజ్ఞానప్రకాశ కిరణములను బ్రపంచమునఁ బ్రసరింపఁ జేయకయే దివముం జేరియుండును.

విద్యాసముపార్జనమునను, సన్మార్గప్రవర్తనను, భగవద్భక్తియందును— శ్రీరామానుజునితోఁ దుల దూఁగఁగలవారెవ్వరును లేకుండిరి.

కాంచీపురపరిపాలకుని రాణివాసమందలి యొకానొక రాజకన్యను పెక్కుదినములుగ నొక దుష్ట గ్రహము బాధించుచుండ, శ్రీరామానుజులు దన యోగశక్తిచేఁ దానిని బాఱఁద్రోలెను. మరణశయ్య యందున ఆచార్యుఁడగు 'ఆళువందారు'— తన ప్రియ శిష్యుఁడగు శ్రీరామానుజునిఁ దీసికొని రా నాజ్ఞాపించి గొందఱ నంపెను. అతఁ డావార్త వినఁగనే బయలుదేఱి వచ్చునప్పటికే తన దేశికుఁడు స్వర్గముం జేరియుండెను. శవహస్తమందలి మూఁడంగుళులు ముడుచుకొని యుంట నాతఁడు గమనించెను. తదభిప్రాయమేమియో యట నెవ్వరికి అర్థము కాలేదు. కాని, శ్రీరామానుజు లూహించి కనుఁగొనెను. బ్రహ్మసూత్రములు, విష్ణుసహస్రనామములు, ఆళ్వారుల దివ్యప్రబంధము— ఈమూటికిని వ్యాఖ్యానములు వ్రాయఁ దనకాదేశించినట్లు శ్రీరామానుజులు అట నున్నవారికి విశదమొనర్చెను. ఆచార్యుఁడగు—ఆయాళువందారు శవమున కాతఁడు సాష్టాం

గముగ సాగిలఁబడి నమస్కరించి యిట్లు వక్కాణించెను:—

“గురుకులతిలకా! తమ యాజ్ఞ శిరసావహించితి. తాము పేర్కొన్న గ్రంథములకు మూఁటికిని నేను స్వయముగ వ్యాఖ్యానములు వ్రాయుదును. అట్లు కాదని నా యాజన్మాంతమున దిట్టలగువారిచే వ్రాయింతును. ఈవిధముగ శ్రీరామానుజులు ప్రతిజ్ఞ యొనర్పఁగనే యాముడిచియున్న మూఁడువ్రేళ్లు చక్కఁగ నిలిచెను. తరువాత నతఁడు తనదేశికునికిఁ బ్రధానశిష్యుఁడయిన పెరియనంబి యుపదేశించిన గురూక్తవిధుల ననుసరించి తప్పకుండ భగవద్భక్తి నలవఱచుకొని, యందనుభవము గడించుటకుఁ బూనుకొనెను.

శ్రీరామానుజులు పరిణీతుఁడై గృహస్థాశ్రమము స్వీకరించెను. కాని, తన జీవితమున సాధింపఁదగిన మహత్తరకార్యమునకు అది భంగకరమని యెంచి, దానిఁ బరిత్యజించి, శ్రీరంగమున నున్న యాశిరాజు ప్రోత్సాహమున సన్న్యాసము దీసికొనెను. శ్రీరామానుజులఁ జంప యత్నించిన తనదుశ్చేష్టకుఁ బశ్చాత్తప్తుఁడై, యతని మొదటిగురువగు యాదవప్రకాశుఁడు సన్న్యాసముం గ్రహించి, గోవిందయోగియను నభిఖ్యం దాల్చి, శ్రీరామానుజుల సేవించు నుద్దేశముతో శ్రీరంగమునకుఁ జనుదెంచెను. శ్రీరామానుజులు భూతదయా స్వభావమున, అపరబుద్ధభగవానుఁడు. మానవులను ప్రేమించుటయందును,— శారీరకబాధలు సహించుటయందును, శాంతగుణమందును రెండవ యేసునాథుఁడు. సర్వస్వము భగవదర్పణము చేయుటయందు మఱొకరూపుదాల్చిన ఆళ్వారుస్వాములు. దైవతత్త్వ నిశ్చయ ప్రచారాభినివేశమున మరల నవతరించిన (సెయింటుజాన్) యోహానుయోగి. తిరుకోట్టియూరనున్న ‘నంబి’ యను మహాత్ముని ప్రబోధమువలన ‘ఓం నమో నారాయణాయ’— అను అష్టాక్షరీ మంత్రము జపింపఁదగు రహస్యవిధానము నుపదేశముఁ గొనెను. సాధారణముగ నాచారము ననుసరించి, యామంత్రమును రహస్యముగ జపింపవలెనని నంబి మహాత్ముఁ డతనికి నొక్కి చెప్పెను. అనర్హులయిన వారి కది యుపదేశింపరాదని యాతని యభిప్రాయము. కాని, రామానుజాచార్యులు, ఆమంత్రమహిమను గనుఁగొన్న పిదప శ్రీరంగదేవాలయమునకు జాతిమత వివక్ష లేక యెల్లరను రండని యాజ్ఞాపించి, తానును ఆకసము నంటుచున్న యాదేవాలయ ముఖద్వారగోపురపు పైయంతస్తున నిలిచి, పిక్కటిల్లి బిగ్గఁగ, ఆయష్టాక్షరీ (రహస్య) మంత్రమును ఉపదేశించెను. గురువయిన నంబి మహాత్ముఁ డీవార్త నాలించి, రామానుజుల యహంభావమునకుఁ జాలఁ గ్రోధము వహించెను. శిష్యు నాజ్ఞోల్లంఘనమునకు ఫలితముగ ‘నంబి’ గురుఁ డాతని నరకకూపమునఁ గూలునట్లు శపించెను. వెంటనే శ్రీరామానుజులు తనగురుని యడుగుఁదమ్ముల పైఁ బడి నమస్కరించి:— “గురుపుంగవా! ఈమహారహస్యమంత్రమును జపమొనర్చుటచే వేలకొలఁది మనుజులు, నరకయాతనలు దప్పించుకొందురేని, అంతకు మించిన యానందము నాకేది గలదు? అంతమాత్రమున దారుణనిరయబాధలు అనుభవింపవలసివచ్చినచో, అట్టివానికి సుస్వాగతము”. శ్రీరామానుజులు పలుకులు విన్న యాగురుని యాగ్రహము తొలఁగుటయే, నతఁడు ప్రశాంతస్థితికి వచ్చెను. శ్రీరామానుజుల విశాలహృదయ మిట్టిదని యెఱింగి నంబిఆచార్యుఁ డాతనిఁ గౌగలించుకొని దీవించెను. తన కట్టిదుస్థితి సంభవించినను మానవకోట్ల విమోచింపవలెనను విచారమాతని కెంత గాఢమయినదో, యీప్రత్యక్ష నిదర్శనమువలనఁ దెలియనగును.

తనకు బ్రప్రథమ దేశికోత్తముఁడయిన శ్రీఆళువందారు కోరిక ననుసరించి, శ్రీరామానుజులు, ఆళువందారుల దివ్యప్రబంధమును బలుమారు చదివి కంఠస్థము చేసెను. అతని శిష్యు లాతని శ్రీ ఆళువందారు యొక్క పవిత్రస్థానమున నిలిపిరి. అతని కెక్కడికేగినను విజయమును, యశమును సంభవించుట తప్పనిసరియయ్యెను. అది గని చూడఁబోని వైరు లనేకు లేర్పడిరి. అందుఁ గొందఱతని ప్రాణములకే యెసరుపెట్టిరి. వీలగుచో వారతని కనువులూడ్పఁబూనిరి. ఒకానొక దినమున అతని భోజనమున విషముఁ జేర్చి యాతిథ్యమిచ్చిరి. కాని, యిట్టి కుట్ర పన్నిన గృహస్థుని యిల్లాలు గుట్టు బయటఁబెట్టగానే— శ్రీరామానుజులు ఉసురులు గాపాడుకొనుపొంటె,— నాఁడాహారమే మానివైచెను. శ్రీరామానుజులు ఆళ్వారులు నిర్వచించిన మార్గమున భక్తియోగమును బ్రచారమొనర్ప హిమాచలమునుండి కన్యాకుమారివఱకుఁ గల యావద్భారతమును సంచరించెను. అతఁడు భగవద్గీతను బ్రహ్మసూత్రములకును వ్యాఖ్యానములు వ్రాసెను. అతఁడు రచించిన వేదాంతవ్యాఖ్యను ‘శ్రీభాష్య’ మనియు నందురు.

శ్రీరామానుజాచార్యులు సిద్ధాంతము ననుసరించు వైష్ణవశాఖకు మూలకారణము (ఉత్పత్తిస్థానము)

మహాలక్ష్మి. కావున, దానిని 'శ్రీసంప్రదాయ'- శాఖ యని వచింతురు. శ్రీరామానుజుల 'శ్రీభాష్యము' మొట్టమొదట కాశ్మీరదేశ పండితులసన్నిధిలోఁ జదువఁబడెను. శ్రీఆచార్య ముఖ్యాంతేవాసి 'కూరత్తాళ్వారు'- ఇతనికే "కూరేశు" డని నామాంతరము. ఇతనికి "పరాశరుఁడు"-, "పిళ్ళనాళ్వారు" అను పుత్రులిరువురుండిరి. "విష్ణుసహస్రనామము"నకుఁ బరాశరుని చేతను, 'దివ్యప్రబంధము'నకు- పిళ్ళనాళ్వారుచేతను శ్రీరామానుజులు వ్యాఖ్యానములు వ్రాయించెను. ఇట్లు, తనకుఁ దన గురువగు 'ఆళువందారు'- మరణసమయమున నాదేశించిన యాజ్ఞలను శ్రీరామానుజులు, తూ- చా- తప్పక పాలించెను.

ఆ కాలమున శైవమతోన్మాదియుఁ, గడు మూర్ఖుఁడు- అగు 'కుళోత్తుంగుఁడు' అను చోళ రాజు పరిపాలించుచుండెను. వైష్ణవమ్ముకంటె శైవమే తొలుతోల్పడినదని నిర్ణయింప ఆభూపతి నిశ్చయించెను. కాన, నతఁడు- 'శివాత్పరతరం నాస్తి' యను వ్రాఁతగల పతాకను శ్రీరంగదేవాలయోపరిభాగమున నెత్తించెను. (శివునికంటె మించిన గొప్పదైవము లేదు) అని దాని భావము. ఎవఁడీసిద్ధాంతమును బూర్వపక్షము చేయునో, వానికి మరణదండనము విధింపఁబడును. ఒకదినము ప్రభువు రామానుజులను దన యాస్థానమునకు నాహ్వానించెను. వెంటనే ఆచార్యుఁడు రాజు తన్ను రానింపఁ గారణ మూహించెను. కాని, అతఁడు విశిష్టాద్వైత మతస్థాపనమునకై చేయఁదగిన కార్యములు పెక్కులుండెను. కాన, అతని ముఖ్యశిష్యుఁడగు కూరత్తాళ్వారు, తన దేశికుని దుస్తులను దాల్చి, 'పెరియనంబి'తోఁ గూడ రాజాస్థానమునకు వచ్చెను. అతఁడు వైష్ణవ మతౌత్కృష్ట్యమును, ప్రభావమును- అక్కడి పండితులు వెఱఁగందునట్లు చర్చించెను. అతనివాదము విన్న విద్వాంసులు బదులీనేరక, అతనిపై నసూయతో వెడలఁగ్రక్కిరి. ఆ ప్రభు వత్యంతము ఆక్రోశముతో- కూరత్తాళ్వారు కనుగ్రుడ్లు పెకలింప నానతిచ్చెను. తన గురువగు శ్రీరామానుజులకొఱకు ఉత్సాహముతో కూరత్తాళ్వారు దారుణమగు బాధ కోర్చికొని కనుగ్రుడ్లను బెకలించియిచ్చెను. కడుబీదతికమున కగ్గమయి కూరత్తాళ్వారు తన కడపటి నారకజీవితమును మిక్కిలిఁ గష్టములతో వెడలఁబుచ్చెను. ఆయన- నష్టదశ- అతని మతవిశ్వాసమున కేమాత్రము భంగకరము గాఁజాలకపోయెను. అమ్మహాభక్తుఁడు- కడవ నియమములవలంబించి- యెంతయు దీక్షతోఁ దన విధుల నిర్వర్తించుటలో వెనుకంజ వేసినవాఁడు గాఁడు. దేవతలమనస్సులు ఉపశమమునంది, వారు తన్ననుగ్రహించుటకై ప్రార్థనము లొనర్పలేదు.- అతని భావానుగుణ్యమగు వేఁడికోలు ఒక్కటే మాటిమాటికి అతనికి మనశ్శాంతి నిచ్చునది:- "ప్రభూ! నీపాదపద్మమందలి భక్తి నాకంతకంతకధికమగుఁ గాక! నీ పావనపదపంకజములకు నాజీవిత మంకితమగుఁ గాక!

కుళోత్తుంగధరణీపతి, కూరత్తాళ్వారు దృగ్వినాశకదారుణక్రియకుఁ బాల్పడుటతోఁ దృప్తిఁ బొందక శ్రీరామానుజుల పోవిడి వెదకి తెలిసికొన, దనరాజ్యమునలుదిక్కులకుఁ బంపెను. కాని, యంతకుమున్నె శ్రీరామానుజులా రాజ్యమును విడిచిపెట్టి మైసూరు రాష్ట్రమునందలి 'సాలిగ్రాం' అను ప్రదేశమున వసించుచుండెను. అపుడా రాష్ట్రమునకు భిట్టిదేవభూపాలుఁడు ప్రభువు. అతఁడు గడ్డుదేజేన వైష్ణవమతావలంబకుఁడు. అక్కడ శ్రీరామానుజులు పండ్రెండు సంవత్సరములు వసించి, వైష్ణవమతవ్యాప్తికి వినువు విరామము లేక పనిచేసెను. క్రీ. శ. 1099 వ, సం॥న 'నమ్మతె' అనుచోట శిథిలమై, పాడుపడిన దేవాలయమొండు, ఆచార్యుఁడు కనుఁగొనెను. తరువాత దానిని పూర్తిగఁ బడఁగొట్టించి, భిట్టిదేవరాయలు మరలఁ గట్టి శ్రీరామానుజుల కది సమర్పించెను. తిరునారాయణపుర దేవాలయమనఁబడు- ఆ దేవళము ఇప్పటికిని అప్రాంతములోఁ బ్రసిద్ధి నొంది వెలయుచున్నది. ఇక్కడ శ్రీరాముని విగ్రహము స్థాపితమయినది. దీనింగుఱించి విచిత్రమైన యైతిహ్యమొండుగలదు:- రాచఱికపు సౌకర్యములను అనుసరించి, యావద్భారతమున నానాఁటినుండియే కేంద్రముగఁ బరిగణింపఁబడు 'ఢిల్లీ'- నగరమునుండి యా విగ్రహమును రాజు నానతిని గొందఱు తెచ్చుచుండ, మధ్యమార్గమున బందిపోటువారుల మూఠా యొకటి వారి నెదుర్కొనెను. కాని అస్పృశ్యులు గొందఱా దారిని బోవుచు, దొంగలగుంపును మార్కొని తఱిమివైచి, శ్రీరామవిగ్రహమును, దానిం దీసికొని వచ్చువారిని సంరక్షించిరి. ఆ తాఁకగానివారిమూఁక చేసిన సేవకానందించి శ్రీరామానుజులు, వారు దేవదర్శనము చేసికొనుట కనుకూలముగ నుండునట్లు గుడివాకిండ్లు తెఱపించెను. అంతియగాక 'తిరుక్కులత్తారు'- శ్రీకులస్థులు అనియు హ

జనులనియు- పవిత్రనామాంతరములను గ్రహించెను.

కులోత్తుంగచోళుని మరణానంతరము శ్రీరామానుజులు శ్రీరంగమునకుఁ దిరిగివచ్చెను. అట నతఁడొక దేవళమును నిర్మింపించి, ఆండాళ్వారుల విగ్రహములను నెలకొల్పెను. వారి పావననామధేయముల నప్పుడప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చికొనఁ గొన్నియుత్సవాదులాచరణకుఁ బెట్టెను. ప్రఖ్యాతినొందిన తిరుపతిలోని గోవిందరాజస్వామి దేవాయతనమును బాగుపఱిచెను. ఆండాదేవుని పునఃస్థాపిత మొనర్చి సంప్రోక్షణాదులు జరిపించెను. దేశమందంతట సంచరించి, ప్రజలకు బోధించి, వారిని భక్తియోగనిష్ఠులఁ గావించెను. తపస్సిద్ధి గని ఐహిక సుఖవిముఖులయిన మహాయోగులు డెబ్బదినల్గురు ఆయన శిష్యులయిరి. కూరత్తాళ్వారు తనయుఁడును మహాత్ముఁడు నగు పిళ్లలోకాచార్యులను తనయనంతరము తనస్థానమునకు రాఁదగినవాఁడని నిర్ణయించి శ్రీరామానుజాచార్యులు భౌతికదేహమును తన 120_వయేటఁ జాలించెను.

---

## శ్రీవేదాంత దేశికుల జీవితము

600 సం||రముల క్రిందట, కంచికి సమీపమందలి 'తుప్పాలు'_ అను కుగ్రామమున మహామహిమోపేతుఁడగు వ్యక్తి యొండు జన్మించెను. శ్రీవేదాంతదేశికునకే వేంకటనాథుఁడను నామాంతరముండెను. కొందఱి విషయమున, వారి నామకరణమునాఁడే నిర్ణయింపఁబడిన సర్వసాధారణమగు పేరికంటె మధ్య వచ్చిన మాఱుపేరుతోనే వ్యవహరింపఁబడుట మన కనుభవైకవేద్యమే. ఇట వేదాంతదేశికుఁడు, వేంకటనాథుఁడు_ ఈ రెండును సరిసమానముగనే ఆవ్యక్తి విషయమున వాడుకలో నుండెను. ఈ వేదాంతదేశికుఁ డమధ్యమయిన పరిశ్రమతోఁ బెక్కు రచన లహరహము చేయుచుండెను. ఇతనికి శ్రీరామానుజుల భక్తియోగమునందు మనస్సు నిలిచి, విశిష్టాద్వైతమున విశ్వాసము కుదిరెను. వేదాంతక్రమ పరిణామమును బరికించితిమేని,_ ఆమార్గమున నిశ్చలముగఁ జరించువానికి అతని పూర్వానుభవములవలన, ఆత్మస్వరూప సంపూర్ణవికాసము సర్వసిద్ధముగ గోచరించును. ఇతఁడు శ్రీరామానుజుల సిద్ధాంతములను సంపూర్ణముగ విశ్వసించి అవలంబించుటయేగాక, వాని విషయములనుబట్టి క్రమానుగుణముగ విస్తరింపఁజేసి సంపూర్ణముగ గడించెను. ఇతఁడు_ సంపూర్ణముగఁ దన సర్వస్వము పరమేశ్వరార్పణ మొనర్చి "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణంమమ" అను వాక్యముగ సార్థకపఱుపవలెను. అదియే "ప్రపత్తి"_ యని, ప్రపత్తినిగూర్చి నిర్వచించెను. అదియే ప్రధాన మోక్షోపాయము. వేంకటనాథుని యడ్డమాకలు లేని చర్చలు స్థిరములై నిలిచి, భగవత్సన్నిధి కించుమించుగ మానవునిఁ దీసికొనిపోఁదగు పటుత్వము గలది. ఇతని వాదములు గొప్పవిజ్ఞానులను సహితము నిరుత్తరులఁ జేయునంతటి నిగూఢ భావ సమపేతములు. గుహాంతర్గత మృగరాజము ట్లితని నిగూఢభావభరిత భగవత్తత్వము హృదయమునుండి వెలికి ఉఱికెడిది.

ప్రకృతము మనకు లభించునట్టి లేఖనప్రమాణముల ననుసరించి వేదాంతదేశికులు_ శా. శ. 119_వ సంవత్సరమునకు సరియగు_ క్రీ. శ. 1269 సం||రమని తెలియుచున్నది. అతఁడు 102 సం||రములు జీవించిన ట్లెఱుంగనయ్యెడు. అగుచో, నతఁడు_ 13_వ, 14_వ, శతాబ్దములకుఁ జెందినవాఁడనవలయును. ఇతని జనకుఁడు 'అనంతసూరి'_ (అనంతాచార్యులు), జనని 'తోతాంబ'_ వైష్ణవమతమందలి 'వడగలై' తెగకుఁ జేరినవారు, అనఁగా ఉత్తరాచారవ్యవహారములకు జితపడినవారు. పారంపర్యముగ వచ్చు నైతిహ్యము ననుసరించి,_ ఇతనితల్లి చాలదినములవఱకు సంతానము లేకుండెను. ఒకనాఁడామె నిద్రించుచు ఇట్లు కలఁగనెను:_ మానవాతీత శక్తులు గల ఒక వ్యక్తి తనకడకు వచ్చి, ఆజ్ఞాపింపఁ, దానొక గంటను మ్రింగినట్లును, అదియే వేంకటనాథుని జన్మమునకుఁ గారణమయినట్లును," గాథయొకటి వాడుకలో నున్నది. దానింబట్టియే ఇతనిని 'ఘంటావతారుఁ'_ డనియు నందురు._ దాని కనుగుణముగ ఈనాఁడును వైష్ణవ దేవాలయములందుఁ బూజాసమయములలో గంటలు వాయింతురు. ఈకట్టుకథను ఉపబలకముగనే, వేంకటనాథుని గంభీరమగు కంఠధ్వనియు, అడ్డుకొనఁజాలని తర్కవాదమును అజేయములు, అత్యద్భుతములు._ కాన 'ఘంటావతారుఁ'డను బిరుద మతనికి సర్వథా యుక్తము.

—(o)—




# సాహసవీరులు

**శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు**

( గతసంచిక తరువాయి )

"నా ప్రాణాలు కాజెయ్యటమే. అది మానవ మాత్రులకయ్యే పనికాదు. ఈ భవనానికి రెండు మైళ్ల దూరంలో ఒకగుహ కనిపిస్తుంది. ఆగుహలోంచి వెళితే ఒక భవనం. ఆ భవనంలో మధ్యగూటిలో రెండు చిలకలున్నయ్. ఒక చిలకను చంపితే నాకు అంగవైకల్యం కలుగుతుంది. రెండో చిలకను చంపితే నా 'చిలక" ఎగిరిపోతుంది, తెలుసా. పదహారువందల మంది రాక్షసులు ఆ గుహకు కాపలా కాస్తున్నారు. అక్కడికి ఎవరైనా వెళ్లటమంటే చేతులారా మృత్యువును కొనితెచ్చుకోవటమే. నాకేం భయంలేదు. నేను చిరంజీవిని.!" అన్నాడు.

"నా అదృష్టం" అంది వైకి.

రాక్షసుడు నవ్వుతూ "ఇంకా జాగు దేనికి. వేగిరం" అన్నాడు.

రాక్షసుని వుద్దేశ్యం కనిపెట్టి వరుని "పదిహేను దినములు నాకు వ్రతముంది ఆ వ్రతానంతరం మన వివాహం! ఆపైన మన విలాసం! సరేనా!" అంది నవ్వుతూ.

"ఓ!" అంటూ ఇవతలకొచ్చాడు.

శివబంటు విషయమంతా ఇదివరకే విన్నాడాయన.

"ఏరా! రేపు మా స్నేహితుడు దొప్పతల రాక్షసుడు విందు చేస్తాడట–నాకు ఆహ్వానం పంపించాడు. కూడా వస్తావా!" అడిగాడు.

"ఓ. తప్పకుండా!" అని అట్టహాసుని అనుసరించాడు శివబంటు.

## 4

అక్కడ హరకుమార్‌ను చేప మ్రింగివేసింది కదూ! అతనికి దారీతెన్నూ తెలీక చాలాసేపు ఆ మత్స్యగర్భంలోనే వుండిపోయాడు. కొంతసేపటికి ఒక జాలరి ఆకొలని దగ్గరకు వచ్చాడు. కొంచెంసేపు నీళ్లలోకి పరికించి చూసి లోపలికి వల విసిరాడు. మొట్టమొదటనే ఈ చేప వలలో చిక్కుకుంది. వలను బయటకు లాగబోయాడు. కాని వల కదలిరాలేదు. ఈచోద్యమేమిటి చెప్మా! ఇంత బరువైన చేపను ఎక్కడా చూడలేదే అనుకుంటూ బలవంతాన పట్టి లాగాడు. వలతాడు పుటుక్కున తెగింది. జాలరి వెల్లకిలా పడిపోయాడు. చివరికెలాగో శ్రమపడి వల నివతలకు లాగగలిగాడు. అంత బరువైన చేపను మోయలేక మోయలేక కొండలన్నీ దాటుకుంటూ ఒక భవనం చేరుకున్నాడు. ఆ చేపను వంట ఇంట్లో పడేసి దొప్పతల రాక్షసుని దగ్గరకు పరుగెత్తాడు. రాక్షసుడు ఈ వింతచేప విషయం వినగానే ఆశ్చర్యంతో చూడవచ్చాడు. విపరీతమైన బరువు వుంది. ఇంతలో నౌకరువచ్చి మీ స్నేహితుడు అట్టహాసుడు వచ్చారు అని చెప్పాడు. "ఓ వస్తున్నా జాగ్రత్తగా కోసి కమ్మదనంగా వండండి" అనిచెప్పి వెళ్లిపోయాడు.

ఇంతలో స్వరూప అక్కడికివచ్చింది, ఆమె అక్కడికిరాగానే అక్కడివాళ్ళందరూ ప్రక్కకు తప్పుకున్నారు. జాలరి ఆవింత చేపనుగురించిచెప్పాడు. ఆమె ఆశ్చర్యంతో చేపనుకదిలించింది. లోపల ఏదో కదులుతుండటం గమనించింది. "మీరంతా

అవతలకుపొండి ఈ చేపవిషయం నేను తెలుసుకుంటాను. నేనే స్వయంగా వంటచేస్తానని మీ రాక్షసునితో చెప్పండి” అంది. వెంటనే వాళ్లు అవతలకు వెళ్లి పోయారు.

ఇంతలో “రక్షించండి ! రక్షించండి !” అని చేప గర్భంలోంచి వినిపించింది. ఆశ్చర్యపడుతూ నెమ్మదిగా చేపను చీల్చింది. హరకుమార్ బయటకు వచ్చాడు. ఆమె ఆశ్చర్యపోతూ “ఎవరు మీరు! ఇలా మత్స్యగర్భంలోకి ఎలా రాగలిగారు?” అని అడిగింది. జరిగిన విషయమంతా చెప్పాడు.

“అయితే మీరిప్పుడు చాలా ప్రమాదస్థలంలో వున్నారు. ముందీ స్థలంనుంచి బయటపడే వుపాయం చూసుకోండి” అంది.

“ఇక్కడ ప్రమాదమైన మనుషు లెవరూలేరే!” ఆమెనవ్వుతూ. “ఈభవనం దొప్పతలరాక్షసుడిది. వాడికంటకినిపించారో మిమ్మల్ని సఫా చేసేస్తాడు.” అంది

“అయితే మీరు ఆరాక్షసునికి కుమార్తె అవుతారా!”

“కాను. నాదంతా ఒక విచిత్రమైనగాథ! నా పేరు స్వరూప. మాది వుజ్జయినీనగరం. మేమిద్దర మక్కచెల్లెళ్ళం, ఒక సారి మేము ఉద్యానవనంలో ఆడుకుంటుండగా వీడు సుడిగాలిరూపు ధరించి మమ్ము గగనానికి ఎగవేసుకుపోయాడు. నాచెల్లెలు ఏమైపోయిందో. నేనుమాత్రం జీవచ్ఛవంలా ఇక్కడవున్నాను. మాటమాట్లాడితే తన్ను పెళ్లిచేసుకోమని ప్రాణాలుతీస్తున్నాడు. ఈ భవనంచుట్టూ రాక్షసులు కాపాలా కాస్తుంటారు. ఇక్కడనుండి తప్పించుకోవటమంటేనే ప్రాణాలమీద ఆశవదులుకోవటం” అంది గద్గదికంగా.

“హరకుమార్ ఆమెకు ధైర్యంచెపుతూ మీరేం భయపడకండి. మిమ్మల్నిరక్షించే భారంనాది. ఈ రోజున ఎలాగైనాసరే వాడిప్రాణరహస్యంకనుక్కోండి ఆతర్వాత కథను నేను నడుపుతాను” అన్నాడు.

“సరే అంది ఆమె.” అన్నట్లు రాక్షసుడువచ్చే వేళయింది. మీరు ఈరూపంలో వుండటం ప్రమాదం మిమ్మల్ని ఎలుకగా మార్చివేస్తాను. ఈ గుళిక నోట్లోవేసుకోండి. గుళిక తీయగానే మామూలు రూపంవచ్చేస్తుంది.” అంది.

హరకుమార్ గుళికను నోటవేసుకొని ఎలుక రూపం పొందాడు.

కొంచెం సేపటిలో దొప్పతల రాక్షసుడు అక్కడకు వచ్చాడు. స్వరూప అతడికి చిర్నగవుతో స్వాగతంచెప్పింది. ఇంకేముంది? రాక్షసుడు వుబ్బితబ్బిబ్బైనాడు. “అదీ! అలా ఎప్పుడు చిరునవ్వు నవ్వుతూ కనిపించాలి. తెలిసిందా. నాస్నేహితుడు అట్టహాసుడిని విందుకుపిలిచాను. ఆ తూర్పుగదిలో భోజనాలు ఏర్పాటుచేయించు - అన్నాడు.

‘పడమరవైపు గదిలో ఏర్పాటుచేయిద్దామనుకున్నానే!” అంది

“అమ్మో! ఆ గది పనికిరాదు!”

“ఏం? అలా అంటున్నారు. నాతో చెప్పకూడనిరహస్యమా -! పోనీలెండి. చెప్పకపోతే దాచుకోండి _”

“అలా అలిగిపోతావేం రాకుమారీ! ఈ విషయం ఎవరితో చెప్పనని వట్టు వెయ్యి మరి చెపుతా’

“మీమీద ఒట్టు సరేనా!”

“పడమర గదిలో ఒకద్వారంవుంది. ఆద్వారంగుండా వెళితే ఒక గది కనిపిస్తుంది. ఆ గదిలో ఈశాన్యదిక్కున ‘నల్లరాయి’వుంది. ఆరాయిని కాపలా కాస్తూ వంద మంది రక్కసులున్నారు. ఆనల్లరాయిలోనే నా ప్రాణంవుంది. ఈ సంగతి ఎవ్వరితోనూ చెప్పకేం చిలకా!” అని కుర్రుమన్నాడు. ఎలుక రూపంలోవున్న హరకుమార్ అంతా గుర్తుపెట్టుకున్నాడు.

కొద్దిసేపటికి అట్టహాసుని వెంటపెట్టుకొని దొప్పతల రాక్షసుడు భోజనాల గదిలోకివచ్చాడు. అట్టహాసుని వెంటనున్న శివబంటును చూచేసరికి ప్రాణం లేచివచ్చినట్లయింది ఎలుకరూపంలోనున్న హరకుమార్నకు. ఎలుక నెమ్మదిగా వచ్చి శివబంటు కాలు గీరటంసాగింది. శివబంటు ఎలుకను విదిలిస్తున్నాడే కాని అసలువిషయం కనిపెట్టలేకపోయాడు. ఈ సారి ఎలుక శివబంటునుదక్కి బైటికి పరుగుతీసింది. శివబంటు కోపంతో ఎలుకను బయటికి తరుముకొచ్చాడు. ఒకమారు మూలదనుకే వచ్చి తథాలున హరకుమార్ అయినాడు. “యువరాజా!”అంటూ గాఢంగా కౌగలించుకున్నాడు. యువరాజు తన కథనమంతా చెప్పాడు. శివబంటుకూడా తనకు సంభవించిన ఘటనలన్నీ చెప్పాడు.

(సశేషము)

# ఎత్తుకు - పైఎత్తు

శ్రీ శాస్త్రి సుబ్రహ్మణ్యం

—(౦)—

చాల సంవత్సరాలకు పూర్వం ఒక గ్రామంలో ధనగుప్తుడను వర్తకుడుండేవాడు. అతడు కడుబీదవాడు. విద్యావిహీనత వల్ల ఎక్కడా ఉద్యోగము సంపాదించలేక పోయాడు. తెలివిగలవాడు. తనకులవృత్తియైన వర్తకముచేసుకుని భార్యను పోషించవచ్చునని అనుకున్నాడు.

ఆ విషయం భార్యతో ప్రస్తావించాడు. ఆమె అంగీకరించింది. ప్రతిరోజు తినుబండారాలు చేసి భర్తకిస్తూండేది. వాటిని తీసుకుని ప్రక్కగ్రామాలకు పోయి విక్రయించేవాడు. దానితో వచ్చినడబ్బుతో ఆభార్యాభర్తలు సుఖవంతమైన జీవితం గడపసాగారు.

రోజులు దొర్లిపోతున్నాయి. ఓరోజున మామూలుప్రకారం జంగిడలో తినుబండారాలు నింపుకుని బయలుదేరాడు. ఆరోజున ఏవేళావిశేషమోగాని ఒక్కసరుకైనా మచ్చుకైనా అమ్ముడుకాలేదు. ఇక ఆరోజు అంతేననుకొని కాళ్ళీడ్చుకుంటూ తిరుగుముఖంపెట్టాడు.

"సరకు ఏమీ అమ్ముడవలేదేమూ!" అని ఆలోచించుకుంటూ త్రోవతప్పాడు. ఒక బ్రహ్మాండమైన అడవిలో ప్రవేశించాడు. కన్నుపొడుచుకున్నా కానరాని ఆ అడవి గుండాపోతున్నాడు. ఏ వన్యమృగమైనా వచ్చి తన్నుచంపేస్తుందేమోయని లోపల భయంగానే ఉంది.

కొంత సేపటికి ఎదురుగా ఓపులి గాండ్రుపెడుతూ అతనివైపు రాసాగింది. ధనగుప్తునికి ముచ్చెమటలూ పోశాయి. అతని గుండెల్లో రైళ్లు పరుగెత్తసాగాయి. "ఎలాగానాకీరోజున చావు తప్పదు" అని ధనగుప్తుడు చింతించసాగాడు. ఆఖరికి ధనగుప్తుడు గుండె దిటవుచేసుకొని ఓ ఉపాయం పన్నాడు.

పెద్ద పులి సమీపించింది. ఆవర్తకుడు కడుపు చెక్కలయేట్లు నవ్వసాగాడు.

"నేను నిన్ను చంపడానికివస్తే ఎందుకు నవ్వుతున్నావ్." అని పులి అడిగింది.

"ఓ పులీ నీవు ప్రతీరోజు, జంతుమాంసముకాని మనుష్య మాంసంకాని తింటున్నావు. నీవు ఆమాంసముతో విసుగెత్తిపోతున్నావని, నా భార్య కొన్ని తినుబండారములు చేసి నీదగ్గరకు నన్ను పంపింది. "చేరబోతే తీర్థము ఎదురైనట్లు" నీవు నాకే అగుపడితివి. నా భార్య ప్రత్యేకంగా నీకోసమే తయారుచేసి ఇచ్చింది. వాటి రుచి అతిమధురమైనది. వాటి పాకము నలభీమపాకముకంటె అద్భుతముగానుండును. నీవెప్పుడూ ఇటువంటి పదార్థము తినియుండవు. అవి నీకునచ్చకపోయినచో అప్పుడు నీవునన్ను చంపుకుతిను." అని ధనగుప్తుడు నిర్భయముగా పెద్దపులితో పల్కాడు.

ఆ మాటలు విన్నపులి కోపమును తగ్గించుకొని హడావిడిచేయడం మానివేసింది. ధనగుప్తుడు తీసుకువచ్చిన

పదార్థములను తినడం ప్రారంభించినది. కొద్దిసేపటికీ ఆజంగిడంతా ఖాళీచేసింది. "ఈ వర్తకుడు మంచిరుచికరమైన క్రొత్త ఆహారము తీసుకువచ్చి ఇచ్చాడు. నేను రోజూ తిను ఆహారము కన్న వేయిరెట్లు మిన్నగానున్నది." అని మనస్సులో అనుకొన్నది.

"ఓ వర్తకా! ఇపుడు నీవు నాకొసగిన మంచి ఆహారమునకు బదులుగా నేను నీకొక గొప్పదియైన కానుక ఇవ్వదల్చాను. నా గుహ దగ్గరకురా" అని గుహదగ్గరకు తీసుకుపోయింది. లోపలికి వెళ్ళి కొన్ని బంగారు నాణెములు కట్టుకువచ్చి ఆవర్తకుని చేతులలో పెడ్తూ, "రోజూ నీవు ఇలాంటి ఆహారము తీసుకువచ్చిన నీకు కావలసినన్ని నాణేములిస్తాను. ఇంకా నా గుహలో విలువకలగొప్పవైన మణులు కూడా ఉన్నాయి." అని చెప్పింది.

ధనగుప్తుడు పులిమాటలు విని సరేనని చెప్పి సంతోషముగాతన ఇంటికి పోయాడు. ధనగుప్తుడు జరిగిన సంగతంతా భార్యతో పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. "ఈ విధముగా మనము రోజూ మణులూ-నాణెములూ సంపాదించవచ్చును, ఇది మంచిమార్గమే" యని భార్య జవాబిచ్చింది.

మరునటి రోజున ఆమె మరియొకరకమైన మిఠాయి తయారుచేసి ఇచ్చింది. ధనగుప్తుడువాటినిగైకొని పులివద్దకు పోయాడు.

వర్తకుని రాకకై పులి ఎదురుచూస్తూ ఉంది. ధనగుప్తుడు పులిని సమీపించి, "ఓ పులీ నా భార్యకు చాలా రకములైన పిండివంటలు తయారు చేయడం తెలుసు. ఈ రోజున కొత్తరకమగు మిఠాయి ఇచ్చి పంపింది. గైకొనుడు" అని వర్తకుడు పల్కాడు.

పులి చాలా సంతోషించింది. ఆతడు తెచ్చిన జంగిడను నిముషంలో ఖాళీ చేసింది. వానిని మెచ్చుకొని అతనికికొన్ని మణులూ - నాణెములూ ఇచ్చింది. వాటిని గైకొని ధనగుప్తుడు సంతోషంగా ఇంటికి పోయాడు.

ఆ విధముగా ప్రతీరోజూ ధనగుప్తుడు క్రొత్తరకమైన తినుబండారములు తీసుకువచ్చి పులికివ్వడం పులి వాటిని భుజించి వానికి మణులూ, నాణెములూ కానుకగా ఇవ్వడం, ఒకసారిగా ధనగుప్తుడు ధనవంతుడవడం జరిగాయి.

పులి గుహకు సమీపంలోనే చాలా పొదలున్నాయి. ఓ పొదలో ఓ జిత్తులమారి నక్క నివసిస్తోంది. రోజూ వర్తకుడు రావటం, పులి వానికి కొన్ని మణులొసగటం ఈతతంగమంతా చూసింది. ఏ విధముగానైనా ఇద్దరినీ చంపి ఆగుహలోని మణులూ - నాణెములూ కాజెయ్యాలని ఓపన్నుగడ పన్నింది.

నక్క పులిగుహవైపు బయలుదేరింది. గుహఇవతలనుంచి "ఓ మిత్రమా! ఓ మిత్రమా!" అని కేకేసింది. పులి బయటకు వచ్చి "ఏమిటి సంగతియని" అడిగింది.

"ఏమీలేదూ నాకు నీమీద జాలి కలుగుటచే నిన్ను ఒక ప్రమాదమునుండి రక్షింపవచ్చాను. నీవు నాకన్న తెలివిగలవాడవు. నీవు ఈ అడవికి రాజువుకూడాను. నిన్ను చూచి ప్రతీ మానవుడూ, ప్రతీ జంతువూ హడలిపోవలసిందే. నిన్ను మోసగించుటకు ఎవరికైనా ధైర్యముకలదా!

కాని ఈ వర్తకుడు నిన్ను చంప ప్రయత్నించుచుండెను'' అనెను.

''ఆ సంగతి నీకెట్లు తెలియును'' అని పులి నక్కనడిగెను.

''ఓ రాజా! నీలాంటి వానికి విపత్తువాటిల్లుతూంటే ఉండబట్టలేక ఉన్నది ఉన్నట్లు విన్నవిస్తున్నాను. నిన్నరాత్రి నేను ఆ వర్తకుని ఇంటిపై పుకి పోయాను. వాడు నిన్ను చంపేస్తే అన్ని మణులూ - నాణెములూ ఒక్కసారే పట్టుకుపోవచ్చు, రోజూ తిరగలేకుండా ఉన్నాన్ను. రేపు చేయు పదార్థములో విషము కలపమని వానిభార్యతో చెపుతూండగా నేవిన్నాను'' అని నక్క చెప్పింది.

''ఓ నక్కా నీవు చెప్పినదంతా నమ్ముట ఎట్లు'' అని పులి అడిగింది.

''ఆవర్తకుడుతినుబండారములు తీసుకు రాగానే నేను కొన్ని పదార్థములు రుచి చూస్తాను. నేనుకనుక అవి తిని మరణించినట్లయితే పదార్థములలో విషముకలిపినట్లు ఋజువగును. అప్పుడు తమరువానిని చంపవచ్చును. నాలాంటి ఒక్క సేవకుడు మరణించిననూ ప్రమాదము లేదు. మీలాంటి ప్రభువులు మరణించిన ఈ రాజ్యమునకు తీరనిలోటు వాటిల్లును. మేమందరమూ తల్లీ దండ్రీ లేని అనాధులమగుదుము'' అని ప్రేమలొలుకునటుల మాటలాడి తనదారిని పోయింది.

మర్నాడు యధాప్రకారంగా ధనగుప్తుడు తినుబండారములను తీసుకువచ్చి ఆ పులిముందు ఉంచాడు. వెంటనే ఎక్కడ పొంచి ఉన్నదో కాని, నక్క హఠాత్తుగా అచ్చటకువచ్చి జంగిడలోని వస్తువులను కొన్నింటిని తింది. తినగానే అయ్యో! శిరోవేదన, భరించలేను. తల తిరుగుచున్నదని యరచుచు అచ్చటనే నేలమీదకొరిగి చనిపోయినట్లు నటించింది.

ఇదంతా అయోమయంగా తోచింది ధనగుప్తునికి. ఇపుడు పులి నక్క చెప్పినదంతా నమ్మింది. కోపంతో వర్తకునితో ఈ విధంగా పల్కింది. ''కృతఘ్నుడా! నేను నీకు మణులూ - నాణెములిచ్చి నీ జీవితమును కాపాడితిని. నన్ను చంపదలచితివా! ఉండు. నిముషంలో నిన్నేంచేస్తానో,'' అని గంభీరంగా గాండ్రుపెట్టసాగింది.

మరణించినట్లు నటించుచున్న నక్క మదిలో సంబరపడసాగింది.

ధనగుప్తుడు ఆశ్చర్యపోయాడు. ఈ రోజున ఈవిధముగా నున్నదేమిటి? దీనికంతకీ కారణము క్రిందచనిపోయిన నక్కయేనని ఇట్టే ఊహించాడు. ఈవిధముగా పులితో చెప్పసాగాడు.

''గౌరవమైన ఓ వన్యరాజా! నామాటలాలకింపుము. నీవు ఇన్నిరోజులనుండీ నామీద చాలా ఇష్టముగా నుండెడిదానవు. నీవీ రోజున ఈవిధముగా నుండుటకు కారణము తెలియరాకున్నది. దీనికంతకీ ఈ మాయలమారి నక్కయే కారణమని నా నమ్మకము.

నాకో ఉపాయము తోచుచున్నది. దైవసాక్షిగా నేనుకాని, నా భార్యకాని తినుబండారములలో ఏవిధమైన విషము కలుపలేదు. ఈనక్క నిన్ను, నన్ను చంపుటకు వేసిన పన్నుగడ. కొద్దినిముషములు నాకు సెలవిమ్ము. అది నిజముగా మరణించినదీ లేనిదీ తెలుసుకొనుటకు దాని శరీర

మును కొద్దిగాకోసిన తెలియును. అది నిజముగా మరణించినట్లయిన నీవు నన్ను చంపి తినుము.'' అని ధనగుప్తుడు పులితో పల్కాడు.

సరేనని పులి సమాధానమిచ్చింది.

చనిపోయినట్లు నటించుచున్న నక్క ప్రాణములు పైనే పోయాయి.

అపుడు ధనగుప్తుడు తన మొలలో నుంచి ఓపదునైన చాకు తీసాడు. నక్కను సమీపించాడు. నక్కయొక్క ఓ చెవి చేతితో పట్టుకొని చాకుతో కోసాడు.

ఆ బాధకు నక్క తాళలేక ''కుయ్యో, కుయ్యో'' అని అరచుకుంటూ దౌడు తీసింది.

తనను చంపుటకు వర్తకుడు ప్రయత్నించలేదని ఇది నక్క పన్నిన పన్నుగడయని పులి తెలుసుకొంది.

ఆ రోజునుండీ ఆ వర్తకుడూ - పులీ గాఢమైన స్నేహితులయ్యారు. ఆ పులి ఆ వర్తకుని ఇంకా ధనవంతుణ్ణిగా చేసింది.


కేసరిగారి

**శ్రీఫలాది పానకం**

గర్భమునందు, నోటియందు మేహజబ్బులవల్ల, యితర కారణములవల్ల పుండగుట, చీము నెత్తురుతో మలము వెలువడుట, నీళ్ల విరేచనములను నివారించును. గ్రహిణిజబ్బులు, అతిసారము, కడుపునొప్పితోకూడిన జిగట విరేచనములను నమ్మకముగా కుదుర్చును.

వెల రు. 1.60

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

మద్రాసు — 14.


ఎత్తుకు పైఎత్తులు బాగానేవేసానని సంబరపడసాగాడు ధనగుప్తుడు.

అప్పటినుంచీ ధనగుప్తుడు - వానిభార్య ఏకష్టాలు రాకుండా సుఖంగా ఉన్నారు.

---

నెల్లూరు లక్ష్మీపురంలో మరొకబాల్కంజీ బారీయూనిట్ స్థాపించబడినది 31-10-59 తేదీ నాడు పైయూనిట్‌ను శ్రీ. యెలిశెట్టి సుబ్బరాయుడు (మునిసిపల్ కౌన్సిలర్) శ్రీ దొంతశెట్టి కన్నయ్య (మునిసిపల్ కౌన్సిలర్) శ్రీ కె. యస్. మూర్తి భగవాన్ ప్రెస్‌మేనేజరు మొదలగు పెద్దలు దర్శించిరి. శ్రీ ఝగ్. లి. శేషయ్య శిశు సంక్షేమమునకై చేయుకృషిని విశేషముగా కొనియాడిరి.

---



# నిరుపమ

మూలం : "నిరాల"

అనువాదం : "అరుంధతి"

(గతసంచిక తరువాయి)

## 9

రామాపురం గ్రామపెద్దలందరూ వేపచెట్టుక్రింద సమావేశమయ్యారు. వర్షాలు కురిశాయి. పొలాలు దున్నడం ప్రారంభించారు. అయినా ఆనాడు తీరు బాటుగా కూర్చొని సామాజిక విషయాలు చర్చించడం మొదలుపెట్టారు. వేణీబాబు పెద్దరాయిమీద కూర్చుని అగ్రాసనాధిపత్యం వహించాడు. అన్ని విషయాలు చర్చిస్తూ కుమార్ బాబు మీద్కికి దృష్టి మరల్చారు. కుమార్ బాబు పట్నంలో బూట్ పాలిష్ చేస్తున్నాడన్న విషయం అందరికీ తెలుసు. అయినా అంతవరకు వారా విషయాన్ని బైటపెట్టలేదు. దాని విషయమై తమ అభిప్రాయ మేమిటోకూడ యెవ్వరికీ తెలీదు.

"అతడసలు విదేశాలనుండి తిరిగివచ్చాక యింటికి రానేలేదు..." అన్నాడు గురుదీన్.

"అసలు యింట్లోవాళ్లను రక్షించడంకోసం అలా చేశాడు" అన్నాడు ఒకడు.

"ఇదిగో - ఒక్కమాట. ఒకర్ని చూచి మనం నవ్వకూడదు. ఎదుటి వ్యక్తిలోని మంచినే తీసుకోవాలిగాని, చెడునే వ్రేలెట్టి చూపడమెందుకు? ఎవరి ఖర్మ వారిది..." అన్నాడు వేణీబాబు.

"తల్లినే కాన్పూరు పిలిపించుకున్నాడుగాని, తానిక్కడికి రాలేదు. అయినా ప్రపంచంలో జరిగేది తెల్సుకోకుండా వుండటానికి గ్రామప్రజలు అంత మూర్ఖులనుకున్నాడా? అసలతడు యిక్కడికి వచ్చే వుంటాడు. తల్లే యెవ్వరికి తెలియకుండా పంపించేసిందేమో!"

"ఒకసారి వాడి తమ్ముడు రామచంద్ర మన నూతికి వచ్చాడు. ఆ నుయ్యి ముట్టుకుంటుకు వల్ల కాదనిచెప్పి ఊరిబైట వాళ్లతండ్రి తవ్వించిన నూతికి పొమ్మన్నాను" అన్నాడు మున్నీ తానేదో ఘనకార్యం చేసినట్లు.

"అసలు వాళ్లింటికి రాకపోకలుకూడ పూర్తిగా తగ్గిపోయాయి."

"పూర్తిగా తగ్గిపోవడమేమిటి? అసలు మా యిళ్లకు రావద్దు, మాతో మాట్లాడవద్దు అని ఖచ్చితంగా చెప్పండి"

"ఎల్లాగయ్యా అంత ఖచ్చితంగా చెప్పేది? కొన్ని తరాలనుండి యీవూళ్లో వున్నారు కదా!..."

"అయినా మీరు చెప్పినంత మాత్రాన్నే వాళ్లకు కళంకం వచ్చేస్తుందా యేమిటి?

"అది కాదయ్యా — అతడు లక్నోలో మాదిగ పని చేస్తున్నాడని యెవ్వరో చెప్పగా విన్నాంగాని యెవ్వరూ చూడలేదుగా - పోనీ మీలో యెవరైనా చూచారా చెప్పండి..." అన్నాడు వేణీబాబు.

అందరూ అతడివైపు కోపంగా చూచారు. "నీకేమైనా మతిపోయిందేమిటి? పాపం లేదు పుణ్యం లేదు."

కొద్దిసేపు అందరూ మౌనం వహించారు. ఇంతలో దుబే వచ్చి "ఏమిటి అంత తీవ్రంగా చర్చిస్తున్నారు?" అన్నాడు.

"ఏముంది - ఉన్నాడుగా యోధుడు - కృష్ణబాబు...".

"ఓహో! కృష్ణబాబు గురించా యిదంతా! ఇప్పుడే లక్నోనుండి వస్తున్నా. తల్లికేదో ఉత్తరం యిచ్చాడు. తల్లికి యిష్టమనుని నలభై రూపాయిలిచ్చాడు..." అనేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. "కలియుగం!" అన్నాడు మున్నీ. "ఈరోజుల్లో రామనామజపం చేస్తే అన్నం దొరకదు. దూరంగా వుండి మోసంచేస్తూంటే అందరూ సంతోషిస్తారు - అయినా రోజులు మారాయి... కలికాలం...".

"అసలు అతడు జాతిధర్మాన్నే వదలిపెట్టి ప్రవర్తిస్తుంటే... కేవలం యిప్పుడు వుంటున్న యిల్లుతప్ప మరేమీ లేదు. పూచికపుల్ల దగ్గర్నుంచి అన్నీ అమ్మేశారు. కాన్పూరులోని యిల్లు రెండూ తనఖా పెట్టారు. కలకత్తాలోని భూములు యెప్పుడో అమ్మేశారు. పాపం! అనుకున్నారు అందరూ. గిరిజాశంకరు పిల్లల ముఖమైనా చూడకుండా చచ్చిపో

యాడు. అప్పులు అప్పుల్లాగే వున్నాయి. ఇవన్నీ తీర్చాలంటే యీ యిల్లు అమ్మేసినా తీరదు.” అన్నాడు మరొకడు.

“అబ్బా! ఆ అడమనిషిరా! ఆ నూతినుండే నీళ్లు తెస్తుంది. రామచంద్ర కూడ అక్కడే స్నానం చేస్తున్నాడు...” అన్నాడు మొదటివాడు.

“కానీ... యెంతవరకు జరుగుతుందో చూద్దాం...”

“ఏదో యెకరం భూమి మిగిలినట్లుగా వుంది. అది కాస్తా నీపేర వ్రాయించుకో - అప్పు తీరినట్లుగాను వుంటుంది - పొలమూ వస్తుంది” అన్నాడొకడు మున్నిలో.

ఎదురుగా వస్తున్న బండినిచూచి వేణు అన్నాడు. “అన్నట్లు మరిచాను. ఈరోజు జమీందారుగారి అమ్మాయి వస్తోంది - ఆబండి ఆమే అనుకుంటాను.”

దగ్గరికివచ్చే బండిని చూస్తూ అందరూ లేచారు.

## 10

రామాపురం గడ్డమీద అడుగు పెట్టగానే నిరుపమ హృదయం ఆనందంతో కావ్యగానం చేసింది. రెక్కలువిప్పి నీలాకాశంలో విహరించే పక్షిలా ఆమె యిక్కడవున్న కొద్దిరోజులూ హాయిగా గడప వచ్చుననుకుంది. ఎప్పుడు తెల్లవారుతుందా అనుకుంటూ క్షణమొక యుగంగా గడిపింది ఆరాత్రి. తెల్లవారగనే నీలి గ్రామం చూడ్డానికి బయల్దేరింది. నిరుపమే నీలిని బాగా ముస్తాబుచేసి పంపింది. ఒంటరిగా వెళ్ల డమంటే నీలికి భయంలేదు. ఆ గ్రామానికి తన అక్క జమీందారిణి అన్నధైర్యం ఆమెకుంది. అక్క తల్చు కుంటే ఎంత?

నీలి వీధిలో నడుస్తుంటే అందరూ విరగబడి చూస్తున్నారు. కాని యెవ్వరూ పలుకరించలేదు. నీలికూడ యెవ్వరినీ పలుకరించకుండానే ఆవీధి దాటి మలుపు తిరిగింది. ఆ వీధిలో ఒక బ్రాహ్మణుడు స్నానంచేసి చిన్న అంగవస్త్రం కట్టుకుని జపం చేసుకుంటూ వస్తున్నాడు. నీలి ఆయన్ను ఆపి “యేమండి తాతగారూ! కుమార్‌బాబు యిల్లు యెక్కడండి?” అంది.

“ఏ కుమార్‌బాబు?” అన్నాడు కోపంగా.

“కృష్ణకుమార్‌బాబు” అంది వినమ్రగా ఆయన ముఖంలోకి చూస్తూ.

“రామ రామ! వాడిల్లా - ఫో ఆ ప్రక్కనవుంది” అంటూ చూపెట్టి రెండడుగులువేసి, చెంబులోని నాలుగు నీళ్లచుక్కలు నోట్లో వేసుకుని ఉమ్మి వేశాడు.

నీలి తిన్నగా కుమార్‌బాబు యింటికి వెళ్లి, యెవ్వరినీ యేమీ అడక్కుండా, కాళ్ల చెప్పులైనా బైట వదలకుండా సావిట్లోకి వెళ్లి నిలబడింది. అక్కడొక పెద్దామె కూర్చుని వుంది.

“ఏమండి - యిది కుమార్‌బాబు యిల్లేనా?”

“అవునమ్మా” అంటూ ఆమె లేచింది.

“కుమార్‌బాబు మీకేమౌతాడు?” అంటూ హిందీలో అడిగింది.

“బాబు... తెల్సిందా - కుమార్ నా బాబు..” అంటూ సావిత్రీదేవి ఆమె తల నిమురుతూ నవ్వి, “రా, కూర్చో” అంటూ నీలిని మంచంమీద కూర్చోబెట్టి, “నువ్వు హిందీ చాలబాగ మాట్లాడుతావే” అంది.

“స్కూల్లో చదువుకుంటున్నాను... కుమార్‌బాబు యెక్కడున్నాడు?”

“అక్కడే వున్నాడు...నువ్వు తీసుకురాలేదా?”

“మొట్టమొదట మా యింటికి యెదురుగావున్న హోటలులో వుండేవాడు. కాని ఆ హోటలువాళ్లు అతన్ని వెళ్లగొట్టేశారు నెల్లాళ్లనుండి కన్పించటం లేదు...”

ఈ విషయాలన్నీ కుమార్‌బాబు యిదివరకే ఆమెకు వ్రాశాడు. అందువల్ల ఆమెకేమీ ఆశ్చర్యం కలుగలేదు. నీలిమాటలు విని సావిత్రిదేవి యేమాత్రం చలించలేదు. ఆమె లోపలికి వెళ్లి ప్లేటుతో టిఫిన్ తీసుకువచ్చి పెట్టింది. నీలికి తినాలని యిష్టంలేక పోయినా, ఏదో ఆలోచిస్తూ ఆ మాటల ధోరణిలో పూర్తిచేసింది.

“అయితే కుమార్‌బాబు మీకు బాగా తెల్సునన్న మాట.”

“నేను అస్తమానం వెళ్లేదాన్ని. మా అక్కకు కూడ బాగ తెలుసు...” అని నోరు జారింది.

ఈ విషయంకూడ సావిత్రిదేవికి మాచాయగా తెల్సింది. అయినా, నీలిచేతే విషయాలన్నీ చెప్పించాలని, “అక్క యెవరు?” అంది.

"మా అక్కే... యింకెవరున్నారు ?"

"అంటే... రామలోచనబాబు కూతురా ?"

"అవును."

పిల్లలు యెంత రహస్యంగా వుంచుదామన్నా అన్నీ కార్యరూపంలో తెలుస్తూనే వుంటాయి. సంసారమార్గంలో తల్లి యెప్పుడూ ఒక్కడుగు ముందరేవుంటుంది. ఏ అభిప్రాయంతో నీలి మాట్లాడుతోందో అది అప్పుడే సావిత్రిదేవి హృదయంపై ముద్రగా పడింది. తనకుమార్ యిక వాళ్లకుమారే అనుకుంది. అతని సమాచారం అనేకరూపాల్లో వాళ్లకు తెలుసు. పట్టణానికి తాను దూరంగావున్నా, అక్కడ జరిగే విషయాలన్నీ తనకు తెలుస్తూనే వుంటాయి.

"నీ పేరేమిటమ్మా ?"

"నీలిమ"

"అంటే మేమందరం నీక్రింద వుంటామన్న మాట."

నీలి నవ్వి వూరుకుంది.

"మీ అక్కయ్య రాలేదేం ?" అంది నవ్వుతూ.

"వచ్చింది"

"మా యింటికి..."

"రాలేదు..."

"ఏం?... మా యింటికి రాకూడదా ?... ఒకసారి రమ్మనమని చెప్పు..." అంది సావిత్రిదేవి నవ్వుతూ. నీలి సరేనని తలవూపింది. ఆ సమయంలోనే రామచంద్రుడు వచ్చాడు బైటనుండి. తల్లినిచూచి, "అమ్మా, మనపాలెం సురేష్‌బాబుగారు దున్నిస్తున్నారు...".

"మనపాలెం యేమిటి? మనం కొన్నామా ?... వాళ్లపాలెం! వాళ్లు తీసుకున్నారు..." అంది సావిత్రీదేవి

"ఇతడి ముఖం కుమార్‌బాబు ముఖంలాగానే వుంది..." నీలి రామచంద్రకేసి చూస్తూ.

"అవునమ్మా, కుమార్ తమ్ముడు..."

"వెళ్లొస్తానండి..." అంటూ లేచింది నీలి. ఆమెను యింటివరకు దిగబెట్టి రమ్మనమని తల్లి రామచంద్రుడితో చెప్పింది. అతడు నీలికంటె రెండుమూడేళ్లు పెద్ద. పొడుగు కూడాను. ఇద్దరూ కలిసి కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. ఎదురుగా నీలి యింటి దగ్గర చాలమంది జనం వున్నారు. అయినా యే బెరుకుబెణుకు లేకుండా నీలి రామచంద్రను వెంటబెట్టుకుని అక్కడకు వచ్చింది. అంతవరకు వచ్చిన రామచంద్ర యీ జనాన్ని చూచి వెళ్లిపోతానని వెనక్కు తిరిగాడు. నీలి అతణ్ణి ఆపి లోపలికి రమ్మనమంది.

రామచంద్ర భయపడుతూ నీలి వెనకాలే లోపలి వెళ్లాడు. బైటవున్న జనమంతా తెల్లబోయి చూస్తున్నారు. రామచంద్ర లోపలికి వెళ్లి యెదురుగావున్న నిరుపమకు నమస్కరించి నిలబడ్డాడు. "అక్కా! కుమార్‌బాబు తమ్ముడు రామచంద్ర" అంది నీలి సంతోషంతో. నిరుపమ చిరునవ్వుతో "నీ పేరేమిటి?" అని అడిగి తన ప్రక్కనున్న కుర్చీలో కూర్చోబెట్టింది. "రామచంద్ర" అన్నాడు నెమ్మదిగా.

"అయితే మా కులదేవతవన్న మాట. నువ్వు రావటం మా భాగ్యమే..." అని ఆదరంగా తల నిమిరింది. రామచంద్ర సిగ్గుతో తలవాల్చి కూర్చున్నాడు. ఇంతలో నీలి ప్లేటుతో టిఫిన్ తీసుకువచ్చి అతని ముందు పెట్టింది. "సిగ్గెందుకు?... తిను..." అంది నిరుపమ అతని గడ్డం పట్టుకుని ముఖం పైకెత్తుతూ. రామచంద్ర టిఫిన్ తింటూవుంటే అతడి ముఖంవైపే చూస్తూ నిరుపమ ఆలోచిస్తూ కూర్చుంది.

గ్రామంలో యెంత తీవ్రమైన ప్రతిఘటనవున్నా, ప్రజలు యెంత అసహ్యించుకుంటున్నా వాళ్లు రోజులు గడుపుతున్నారు. మానవుల్లో - తమలో తమకే యింత వైరం, విద్వేషం వుంటాయని పాపం ఆ కుర్రాడికేం తెలుసు? ఆ చిన్నముఖం యెంత ఆకర్షణీయంగా వుందో! గ్రామంలో యెవ్వరూ అతణ్ణి గుమ్మం త్రొక్కనివ్వరు. ఎవ్వరూ అతనితో స్నేహం చెయ్యరు. ఆఖరికి గ్రామంలోని నూతినీళ్లుకూడ వాళ్లను తోడుకోనివ్వరు. చాకలివాళ్లు బట్టలుతకడం మానేశారు, క్షౌరం చేయించుకోవాలంటే ప్రక్కనున్న పట్టణం వెళ్లవలసి వచ్చేపరిస్థితి యేర్పడింది. తల్లికైతే యీ వూళ్లో వుండటం యిష్టంలేదు. కాని యెక్కడికైనా పోదామంటే నిల్చొందుకు కూడ స్థానం లేదు. కుమార్‌బాబు బాగా చదువుకున్నవాడే. తెలివితేటలున్నాయి. అందుచేతనేమో అతనికెక్కడా స్థానంలేకుండా పోయింది.... అన్నగారు మాదిగపని చేసి డబ్బు సంపాదించి పంపిస్తున్నట్లు రామచంద్రకు తెలీదనుకుంది. అమ్మయూ, తననూ అతనివద్దకు లక్నో యెందుకు తీసుకువెళ్లడని అన్నగారిమీద ఒక్కొక్కప్పుడు కోపం వస్తుంది. అమ్మే ఒక్కొక్కప్పుడు

మంచిమాటలు చెప్పి ఓదారుస్తూ వుంటుంది. ఊళ్లో నూతిదగ్గర నీళ్లు తోడుకోనివ్వకపోతే యెక్కడో పొలాల్లోవున్న నూతిదగ్గరనుండి తెస్తుంది. అయినా గ్రామప్రజలకు తనమీద అంతకోపమెందుకో ? ఎవరు యేంచేశారు ? తనతో యెవ్వరూ మాట్లాడరు, యెవ్వరిళ్లకూ తనను రానివ్వరు. అక్కడ కూర్చున్న ఆ క్షణంలో రామచంద్ర మనసులో అనేక ఆలోచనలు పరుగెత్తాయి. అయితే... వీళ్లు తనపొలాన్ని యెందుకు దున్నుతున్నట్లు ? యిక మళ్లీ యివ్వరా ? అయినా - ఆమె మంచిమనిషి అలా చేయదుగా అని సరిపెట్టుకున్నాడు. ఇదంతా యీ సురేష్‌బాబే చేస్తున్నాడు.

"చదువుకొంటున్నావా, రామచంద్రా ?"

"చదువుతున్నా."

"ఏ క్లాసు ?"

"ఎనిమిది..."

"బాగుంది... అయితే మీ అన్నగారెక్కడున్నాడు... ?"

"లక్నోలో"

"పేరేమిటి ?"

"కృష్ణకుమార్."

"అక్కడ యేంచేస్తున్నారు ?"

ఆవిషయం అతడు చెప్పదలచుకోలేదు. అందువల్లే అతడు నిరుపమ ముఖంలోకి చూస్తూ మౌనం వహించాడు. "నాకు తెలుసులే - మా యింటికి వచ్చాడు" అనేసరికి రామచంద్ర వెళ్లిపోతానంటూ లేచాడు. నిరుపమ నవ్వింది. ఆమె కేవలం చక్కిలిగింత పెట్టినట్లైంది. గబగబ రెండడుగులు వేసి పోతున్న రామచంద్రను పట్టుకుంది. అతడి స్పర్శతగలగానే ఆ క్షణంలో యేదో తెలియని అనుభూతి పొందింది. "ఇప్పుడేగదా వచ్చింది. కాస్సేపు కూర్చో" అంది నిరుపమ. మారుమాట్లాడకుండా కుర్చీలో కూలబడ్డాడు.

"అయితే మీ డాక్టరన్నయ్య యేం చేస్తున్నాడు ?" అంది మళ్లీ.

"నాకు తెలీదు" తలవంచుకునే అన్నాడు.

"డాక్టరంటే యెందులోను ? హోమియోపతియా ?"

"కాదు - ఇంగ్లీషు..."

"అంటే - ఆపరేషను చెయ్యడంలోనా ?" నవ్వుతూ అంది.

"అయితే కోతలు కోసేవాళ్లేనేమిటి డి.లిట్. అయ్యేది ?" అన్నాడు కోపంగా. ఆ కోపంలో యేదో తెలియని మాధుర్యం కనిపించింది నిరుపమకు.

"అయితే నువ్వూ అల్లాగే డి. లిట్. చదువుతావా ?"

"ఆ !"

"డబ్బు మీ అన్నయ్య యిస్తాడా ?"

"ఇస్తానని వ్రాశాడు. కాని యింతవరకు మా అమ్మే యిస్తోంది."

"మీ అమ్మగారు బెంగాలీ మాట్లాడుతారా"

"ఆ, చదువుతుంది. వ్రాస్తుంది కూడ..."

"అక్కా, నేనిందాక వాళ్లింటికి వెళ్లాను. పంటలు పెట్టింది. బెంగాలీకూడ చాల చక్కగా మాట్లాడింది. మీ అక్క రాలేదేమని అడిగి, నిన్నొకసారి రమ్మనమంది" అంది నీలి. ఎందుకు వెళ్లలేదా అని ఆలోచిస్తూ ఒక్క క్షణం కళ్లుమూసుకుంది.

"అయితే, రామచంద్రా ! నీకు నెలకు యెంత ఖర్చు అవుతుంది ?"

"ఇరవై"

"సరే. నెలకు ఇరవైరూపాయలు నేనిస్తాను చదువుకో - ఏం - పైకి వెళ్లినకొద్దీ యెక్కువ యిస్తాను..."

"మా అన్నయ్య యేమైనా అంటాడేమో ?"

"ఆ, యేమంటారు ?" కోపంతో అన్నట్లుగా అంది. ఇంతలో నౌకరు వచ్చి, "అమ్మా పొలంలో విత్తనాలు జల్లుతున్నారు. చూడ్డానికి అన్నయ్యగారు రమ్మన్నారు" అన్నాడు.

నిరుపమ లేస్తూ, "మీ అమ్మగార్కి నా నమస్కారం చెప్పు. రేపువచ్చి ఆవిణ్ణి చూస్తాను." అంది నవ్వుతూ. రామచంద్ర పొలం సంగతే ఆలోచిస్తూ యింటికి వచ్చేశాడు.

(సశేషము)

# బస్సుస్టాండు దగ్గర

రచన: హు యి - హ్సి యో



ప్రతిరోజు నేను 16వ నెంబరు బస్సులో యెక్కి నగరం తూర్పుప్రాంతంలో ఉన్న 'అంధుల లోహ యంత్రాగారానికి వెళుతుంటాను. నగరం పశ్చిమ ప్రాంతంలో పనిచేస్తున్న నా భర్త నాతోపాటు రావడం సాధ్యం కాదు. అందువల్ల బస్సుదిగిన తర్వాత సహాయంచేయను యెవ్వరూ లేకపోతే నేనే తడువుకొంటూనే యంత్రాగారానికి చేరుకొంటాను. సాయంత్రంపూట నా తోటికార్మికురాలిని ఇంటికి తీసుకువెళ్లడానికి వచ్చే ఆమె బంధువులే నన్నుకూడా బస్సుస్టాండు దాకా దిగబెడతారు. మొత్తంమీద యీ విధంగా గడచిపోతూ ఉంటుంది.

గత ఆకురాలు కాలంలో ఒకనాటి ఉదయం యెవరో నన్ను బస్సులోంచి క్రిందికి దింపుతూ ఉండగా నాకు ఒకబాలుని కంఠం వినిపించింది. "నమస్కారం అత్తయా!" అంటూ ఆ బాలుడు నన్ను చెయ్యిపుచ్చుకొని యంత్రాగారం వైపుకు నడిపించసాగాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. "బాబూ, నువ్వు పొరబడుతున్నావేమో నేను..." అని మాట్లాడుతుండగా ఆ బాలుడు అందుకొని—

"నీ పేరు ల్యూ కాదా అత్తయా? నువ్వు అంధుల యంత్రాగారానికి వెళుతున్నావు కదూ? నిన్ను అక్కడికి దిగబెడతాను" అన్నాడు.

ఈ బాలుడు యిలా సహాయం చేయడానికి కారణం యేమిటి? 'ప్రజలకు యేదైనా మంచిచేయి' అన్న ఉద్యమాన్ని తన పాఠశాలలో ప్రారంభించారని ఆ పిల్లవాడు చెప్పాడు. అంతకు ముందురోజు ఉదయంపూట బడికిపోతూ ఆ బాలుడు ఒక గుడ్డి మనిషి చేతికర్రతో తడువుకొంటూ పోతుండడం చూచాడు. తెల్లవారుతున్న సమయం కావడంవల్ల వీధులన్నీ ప్రశాంతంగా ఉన్నాయి. పిల్లవాడు ఆ అంధుని దగ్గరకువెళ్లి చేయిపట్టుకొని నడిపించసాగాడు. అంధుల లోహయంత్రాగారానికి అతడు వెళుతున్నాడని తెలుసుకొని, "మా స్కూలు మీ యంత్రాగారానికి దగ్గరలోనే ఉంది మామయ్యా. మీ యంత్రాగారానికి నిన్ను రోజూ దిగబెడతాను" అన్నాడా బాలుడు. "నువ్వు చాలా మంచివాడివి నాయనా" అన్నాడా అంధుడు. "మాయింటి అబ్బాయే నన్ను రోజూ యంత్రాగారానికి దిగబెడుతుంటాడు. ఇవ్వాళ యేదోపని ఉండడంవల్ల రాలేకపోయాడు. కాబట్టి నువ్వు ల్యూ అత్తయ్యకు సాయంచేయి. ఆమె పదహారో నెంబరు బస్సులోంచి ఆ గేటుదగ్గరే దిగుతుంది" అనికూడా ఆ అంధుడు చెప్పాడు. నేను యెలావుంటానో వివరించి ఆ బాలుడికి చెప్పాడట. ఈ విధంగా ఆ బాలుడు నాకు సహాయం చేయడానికి వచ్చాడు.

నాకు చాలా ఆనందం కలిగింది. "నీ పేరేమిటి నాయనా? నీవు బుద్ధిమంతుడవని మీబళ్లో చెబుతాను. తక్కిన పిల్లలుగూడా నిన్నుచూచి మంచి బుద్ధులు నేర్చుకొంటారు" అన్నాను.

పిల్లవాడు చాలా మాటకారే. కాని నేనడిగిన విషయానికి సమాధానం చెప్పలేదు. నేను మళ్లీ అడిగినప్పుడు మాత్రమే అతడిలా అన్నాడు, "ఇతరులకు సహాయం చేయడం బాలసంఘ సభ్యుల ధర్మం. చేసిన సహాయాన్ని గురించి ఇతరులకు చెప్పకోము. మాబడి పిల్లల్లో ఒక అబ్బాయి నీళ్ళల్లో మునిగిపోతున్న యిద్దరు బాలురిని రక్షించాడు. కాని ఆ విషయాన్ని గురించి మాకు చెప్పనేలేదు. ఆ విషయం మాకు రెండు సంవత్సరాల తర్వాత తెలిసింది."

శీతాకాలంలో ఒకరోజు మంచు బాగా కురుస్తున్నది. పైగా నాకు తలనొప్పిగా కూడా ఉన్నది. అందువల్ల యంత్రాగారానికి వెళ్లవద్దని నా భర్త అన్నారు. కాని నాకు చాలా దిగులు కలిగింది. నేను ఇలా యిక్కడ కూర్చొనిఉంటే ఆ బాలుడు నాకోసం బస్సుస్టాండు దగ్గర యెదురు చూస్తుంటాడేమో... కాని నేను కనబడకపోతే బడికి వెళ్ళిపోకుండా ఉంటాడా?

ఇలా నేను ఆలోచిస్తుండగానే పరిచితమైన ఒక కంఠం వినబడింది. "ల్యూ అత్తయ్యా! ల్యూ అత్తయ్య ఇంటిలో ఉన్నదా?" అదుగో రానే వచ్చాడా బాలుడు!

"ఇంట్లోనే ఉన్నాను, లోపలికి రా," అన్నాను.

పిల్లవాడు లోపలికి వచ్చి ఆదుర్దాగా ఇలా అన్నాడు.

"నువ్వు బస్సుస్టాండు దగ్గర కనబడకపోతే యంత్రాగారానికి వెళ్లానత్తయ్యా. కాని అక్కడికీ రాలేదన్నారు. మంచు బాగా కురుస్తున్నది గదూ, యేం జరిగిందోనని భయంవేసింది. అందువల్ల నీ అడ్రసు తీసుకొని యిలా పరుగెత్తుకొచ్చాను...."

చాలా మాసాలవరకు ఆ అబ్బాయి నన్ను రోజూ బస్సుస్టాండు దగ్గర కలుసుకొంటుండేవాడు. కాని మొన్నటిరోజున బస్సుదిగగానే నాకు ఒక బాలిక కంఠం వినిపించింది. "నమస్కారం ల్యూ అత్తయ్యా", అన్నదాబాలిక. నాకు ఆశ్చర్యం కలిగింది. నన్ను రోజూ యంత్రాగారానికి తీసుకొనివెళ్లే అబ్బాయి చెల్లెలిని చెప్పిందా అమ్మాయి. ఆ పిల్లవాడు సెకెండరీ పాఠశాలలో చదువుకుపోతూ నన్ను యంత్రాగారం దగ్గర దిగబెట్టే పనిని యీ అమ్మాయికి అప్పజెప్పి వెళ్లాడట. తాను సెకండరీ చదువుకు వెళ్లేవరకు యీ పనిని నెరవేరుస్తూ, తర్వాత తమ తమ్ముడికి ఆ పనిని అప్పజెప్పమనిగూడా ఆ బాలుడు చెల్లెలికి చెప్పాడట.

ఆ మాటలు విన్నప్పుడు నా హృదయం యెలా ఉప్పొంగిందో చెప్పనలవికాదు. అందరికీ యీ విషయం తెలియాలని యీ కథను వ్రాసాను.


మొదడును చల్లబరచి
శిరోజములను నల్లబరచి
కుదుళ్లను పదిలము చేయునది

కేసరిగారి

భృంగామలకతైలము

వెల రు. 2

కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

రాయపేట, మద్రాసు 14.



డాక్టరు కే. యన్. కేసరిగారి

'నా చిన్ననాటి ముచ్చట్లు'

వెల రు. 2.00 లే — పోస్టేజి ఉచితం

హిగిన్ బాదమ్స్ స్టాల్సులో దొరుకుతుంది

# "ప్రణయం పరిణయం"

శ్రీ కేశిరాజు సోమేశ్వరరావు

అనంతవినీలాకాశంలో అనుక్షణం చలిస్తోన్న తారుమేఘాలు, ... నల్లత్రాచులా వంపులుతిరిగి జరజరా ప్రవహిస్తూ దూరాన సున్నగా కనిపిస్తున్న కొండల నీలములో కలిసిపోతోన్న సెలయేటు ... సాయంకాలపు నిర్మల వాయువులకు స్వాగతసూచకంగా తలలాడిస్తున్న కొబ్బరచెట్లు ... వాటి అంచులపైగా జారిపోతోన్న సంధ్యారుణుని స్వర్ణారుణ కిరణాలు ... వినూత్న శోభతో ప్రకృతిమాత వైభవాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి.

సంధ్య కాంతుల్తో సయ్యాటలాడుతూ హాయిగా వీచేపిల్లగాలులకు తన్మయురాలైమాలిని, మదిలో మెదిలే మధురస్మృతులను మననంచేసుకుంటూ, వాటి వెనుదాగి ఉన్న వ్యధను మరిచిపోవ వ్యర్థప్రయత్నం చేస్తున్నది. జీవితంలో ఆశించిన స్వర్గమయానందం చేతికిందినట్లే ఉండి మాయమవడంతో, మళ్లీ దానిని పొందగలననే ఆశ లేక, వేదాంతిలా నిర్లిప్తతవహించ సాగింది. కాని దేహానికి సహజసిద్ధములయిన వాంఛలను, అది కోరేమధురాను భూతులను బలవంతంగా అణచి యుంచాలంటే ఎలా సాధ్యమౌతుంది! అతి చంచలాలయిన మానవస్వభావాలు ఒక్క త్రాటిపై ఎలానిలువగలవు!

మొదటినుంచీ మాలిని మనస్సు నల్లరాయిగాదు. ఆమెహృదయంగూడా సుధామయమైనదే, కాని ప్రథమంగా ఆమె తన హృదయంలో ప్రతిష్టించుకున్న ప్రణయ పురుషుడు ఆమెకు దక్కలేదు. అతడు ఆమెను ప్రేమించి ఎన్నోవాగ్దానాలు చేసి, తుదకు తన వివాహవిషయం గూడా ఆమెకు చెప్పలేనంత పిరికివాడై పోయాడు. అయినా అతని మూర్తిని మరచి పోవాలంటే ఆమెకు సాధ్యంకాలేదు. ఆతని సుదీర్ఘస్వరూపం ఇంకా కళ్లముందు తిరుగుతూ మరువలేని దివ్యస్మృతులను మనఃపథానికెచ్చి మరింతవ్యథ కల్గిస్తోంది.

మాలిని కళ్లు అశ్రుపూరితాలయినాయి. మసకజెందిన ఆమెలోచనాలకు దూరాన కదులుతున్న కొబ్బరాకుల మధ్య సుదాకర్ స్వరూపం గోచరించింది. బాధగా కళ్లుమూసుకుని బరువుగాకన్నీటిని రాల్చిందామె.

♦ ♦ ♦

మాలిని గత సంవత్సరం నెల్లూరిలో పినతల్లి వద్ద ఉండి ప్రీయూనివర్సిటీ చదివింది. హాయిగా ఏ బాధలు లేకుండా కాలంగడిచిపోయేది. అప్పుడే నళినితో ఆమెకు స్నేహమయింది. నళినిగూడ మాలినితో బాటు కాలేజీలో చదువుతోంది. ఇద్దరికీ సంగీతంపైన సాహిత్యంపైన ఎక్కువ ఆసక్తి ఉండేది. వారికి తీరిక సమయాల్లో మాలిని ఇంట్లోనో నళిని ఇంట్లోనోకూర్చుని అనేక విషయాలగురించి చర్చించుకునేవాళ్లు. ముఖ్యంగా సాహిత్యంపైవారికి ఎక్కువ అభిప్రాయభేదాలుండేవి: శరత్ కథలంటే మాలినికి అభిరుచిఎక్కువ. టాగూరు రచనలకు నళిని ఎక్కువ విలువనిచ్చేది.

ఒక రోజు మాలిని సినిమాకు వెళ్లాలనుకుని నాలుగుగంటలకు మొదలు పెట్టిన ముస్తాబు ఐదు గంటలకు పూర్తిచేసి, వేనిటీ బేగు చేతిలోవుంచుకొని, మళ్లీ ఒకసారి స్వముఖదర్శనం చేసుకొని, కనుబొమలు, వాటిపైగా, చెవుల చుట్టూ చెదిరిన ముంగురులు ఫాషన్‌గా గోళ్లతో దిద్దుకుని, బూట్లువేసుకుని బయటకు నడిచింది, ఇంతలో నళిని ఆమెతో చనువుగా మాట్లాడుతూ. ఒక సుందరయువకుడు ఆమెకెదురు వచ్చారు. తనకపరిచితుడైన యువకునితో నున్న నళినిని పలుకరించడానికామెకు మనస్కరించక చూచి చూడనట్లు పోతూండగా నళిని ఆమెను పిలవడం, ఆయువకుని పరిచయం చెయ్యడం అప్రయత్నంగా జరిగిపోయాయి. ఆతడు తన అన్న సుదాకర్ అని, మద్రాసులో ఇంజినీరింగ్ పూర్తిచేసి ఫలితాలకై ఎదురుచూస్తున్నాడని చెప్పింది. మాలని బలవంతంపై ఆరోజు ముగ్గురూ సినిమాకు వెళ్ళారు.

ఇప్పుడప్పుడే వికసిస్తున్న ఆమె హృదయంలో సుధాకర్ సంచలనం కలిగించాడు. రోజు రోజుకూ సుధాకర్‌తో మాలినికి పరిచయ మధికమయి స్నేహం క్రింద మారింది. ఆతనితో అతిగా మాటాడగూడదను కుంటూనే ఆమె అతన్ని చూడందే ఉండలేక పోయేది. అప్పుడప్పుడు సుధాకర్ ఆమెవద్దతీసు కునేచనువు, చేసేపరిహాసం ఆమెకు సిగ్గు కలిగించేది. తత్ఫలితంగా ఆదివారాలు ఆమె నళిని ఇంటికి తప్ప కుండా రావడం, ముగ్గురూ కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడుకొని పెన్నానదీతీరాలకో, మ్యాటినీకో వెళ్ళడం పరిపాటయింది.

ఒక రోజు నళిని ఇంటివద్ద, మేడమీదగదిలో ముగ్గురూ కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. కాఫీ తెచ్చేందుకు నళిని క్రిందకు వెళ్ళింది. మాటలధోరణిలో సుధాకర్ ఆమె చెయ్యిపట్టుకున్నాడు. ఆమె వదనం సిగ్గుతో వాలిపోయింది. అది మొదలు ఆమె విశుద్ధ హృదయంలో అతని ఎడల ఏదో తీవ్ర ఆకర్షణ బయల్దేరింది. మరునాటి సాయంకాలం ముగ్గురూ మామూలుగా నది ఒడ్డుకు వెళ్ళారు. ఆరోజు ఎందు చేతనో సుధాకర్ మౌనంగా ఉన్నాడు. అతని మన స్సులో ఏదో సంఘర్షణ జరుగుతున్నట్లు మాలిని గ్రహించింది. కొంచెం దూరంలో ఎవరో స్నేహితు రాలు కనిపిస్తే నళిని ఆమె వద్దకు వెళ్ళి మాటాడుతూ అక్కడే కూర్చుండి పోయింది. నీలాకాశంలో బారులు తీరి కొంగలు అందంగా ఎగిరిపోతున్నాయి. సంజవెలుగులో మాలిని సుధాకరుకు అప్సరసలా కన్పించింది. ఆమె తెల్లటిశరీరంపై నీలంరంగుషిఫాన్ సిల్కుచీర, పరిపక్వంగాని వక్షోజాలను మరుగుపరు స్తున్న ఆదేరంగుసిల్కుచోళీ వింత అందంచేకూరుస్తు న్నాయి. గాలికి మాటిమాటికి జారిపోయే పమిటి చెంగును వయ్యారంగా సర్దుకుంటుండగా, ఆమె సురూపాన్ని కళ్ళతో త్రాగుతూ సుధాకర్ మెల్లిగా ఆమె ప్రక్కకు వచ్చాడు. తడబడేకంఠం సర్దుకుంటూ "మాలినీ నీ అపురూపసౌందర్యం నన్ను ముగ్ధుణ్ణిచేసింది. అన్నివిధాలానీవునన్ను ఆకర్షించావు. నిన్ను ఒకక్షణం గూడా విడచి ఉండలేనంత దుర్బలుణ్ణిగాచేసావు. నిన్నుహృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. నాశరీరంలోని ప్రత్యణువూ నీకోసం తహతహలాడు తోంది." అన్నాడు ఆవేశంగా. అతని మాటలకు సిగ్గుతో మాలిని ఏమిమాటాడలేదు. శరీరంలోని యువరక్తమంతా ఒక్కసారి ముఖంలోకి పొంగగా ఏదో అవ్యక్తానందంలో ఆమె తలవంచుకుంది.

"మాలినీ ఏం ముభావంగా ఉన్నావు, నన్ను ప్రేమించలేవా. నా ఆశలన్నింటిని నేలపాలు చేస్తావా" అన్నాడు దీనంగా. క్రింద ఇసుకలో గీతలు గీస్తూ "సుధాకర్! నిన్ను ప్రేమించకుండా ఉండగలనా! సదా నీ సమక్షాన్నికోరే నాహృద యాన్ని, నీ సుందరరూపాన్ని చూడాలని వాంఛిం చేనానయనాల్ని నీనుండి మరలించుకోగల శక్తినా కెక్కడిది," అంది మెల్లగా. సుధాకర్ పట్టరాని ఆనందంతో ఆమె దగ్గరగాజరిగి. "మాలినీ ... నీ చేతిలో చేయివేసి చెపుతున్నాను. నిన్ను తప్ప వేరె వర్నీ వివాహమాడలేను. నీవు నాప్రక్కనుంటే ఈ ప్రపంచంలో నాకు కష్టమనేది ఉండదేమో. ఉన్నా నీ ఆసరాతో సులభంగా దాన్ని గడిచి వేయగలనని నాకు ధైర్యముంది." అన్నాడు.

అతని ఆవేశం చూస్తూంటే మాలినికిభయం వేసింది. "సరే సుధాకర్ నిజమేననుకో కాని మనిద్దరి మధ్య ఉన్న వర్ణభేదాన్ని నీవధిగమించ గలిగినప్పుడుగదా" అంది సంశయంతో. "నీకు ఆభయం అక్కర్లేదు మాలినీ! నీ అంగీకారముంటేచాలు. మన వివాహానికి మాపెద్దలు అంగీకరించారా సరే లేనిపక్షంలో నీ కోసం వారినందరని వదలడానికి సిద్ధంగా ఉన్నాను." అంటూ ఆమె నడుంమీదచేయి వేశాడు. మాలిని అతని తీవ్రనిశ్చయానికి ఆనంద పడింది. తన కలభ్యమనుకున్న వస్తువు లభ్యమౌ తూందన్న సంతోషంలో ఆమె అతని చేతినిగమనించ లేదు. క్షణంలో ఏదో గుర్తుకువచ్చినట్లు తన చేతితో అతని చేతినితీసివేసి దూరంగాజరిగికూర్చుంది. "సుధా కర్! మనవివాహమయిందాకా నా వద్ద మరింతచనువు కోరడం నీకూ భావ్యంకాదు. ... నాకూ శ్రేయ స్కరంకాదు కాబట్టి ... " సుధాకర్ కోపంవచ్చి నట్లు ముంగమూతి పెట్టి అటు వైపు తిరిగాడు. మాలిని అతనిని చూచి కిలాకిలానవ్వింది.

రోజురోజుకు మాలినీ సుధాకరులు మరింతసన్ని హితులయారు. కాని ఏకాంతంలో అతని ఆవేశా నికి బలికావడానికి మాలినికించిత్తూ అంగీకరించలేదు. స్త్రీకి వెలలేని ఆభరణం శీలమని, జీవితంలో దానిని పోగొట్టు కోవడం అవివేకమని ఆమెకు తెలుసు.

ఆమె అనుమానానికి తగినట్లుగానే జరిగింది. ఇక వారంరోజులకు పరీక్షలు జరుగుతాయనగా ఒకనాటి ఉదయం నళిని శుభలేకతెచ్చి మాలినికి ఇచ్చింది. అందులో తనను హృదయపూర్వకంగా ప్రేమించిన

సుధాకర్ మరొక కన్యతో వివాహానికి అంగీకరించాడు. అతనిని ఆమె ప్రేమించమని అర్థించలేదు, కాని అతడే ఆమె నిశ్చల జీవితాన్ని కల్లోలపరచాడు. వ్యథ సహింపగని ఆమె హృదయంలో ఆరని గాయం చేసాడు. ఆ దిగులుతోనే ఆమె పరీక్షలను పాడుచేసింది. తండ్రి వద్దకు స్వగ్రామానికి వచ్చింది.



గతస్మృతులను పూర్తిగా మరచిపోయి నూతన జీవితం గడపాలని వాంఛించే ఆమెకు ప్రతిక్షణం భారంగా గడుస్తోంది. గంటల తరబడి ఏకాంతంగా కూర్చుంటూ శూన్యహృదయంతో ఆలోచిస్తూంటే ఆమెకు మరింత వ్యథ కలిగేది. ఆ బాధలోనే ఏదో అవ్యక్తమైన మధురానందం ఆమె అనుభవించేది.

ఇంతలో నాగరాజు రాక ఆమెలో మళ్లీ సంచలనం కలిగించింది. మధ్యాహ్నం భోజనాల వేళ చిన్ననాటి చనువుతో నాగరాజు ఆమెను పలుకరించాడు, పూర్వంలా అతన్ని చూడగానే ఆమె సిగ్గుపడి పారిపోలేదు. ముభావంగా నిర్లిప్తతతో సమాధానమిచ్చింది. మరునాటి సాయంకాలం మాలిని పెరటిలోని తోటలో మల్లెపూలు కోస్తుండగా నాగరాజు వచ్చాడు. ఉల్లాసంతో ఉత్సాహంతో నిండిన అతన్ని చూడగానే ఆమె మనస్సులో కలుక్కుమంది. పైకి నవ్వుతూ "ఏం బావా ఇలా వచ్చావ్. ఏమిటి విశేషాలు" అంది. నాగరాజు గంభీరంగా "మాలినీ నిన్నటినుంచి చూస్తున్నాను. పైగా మామయ్యగూడా చెప్పాడు. ఎప్పుడూ పరధ్యానంగా ఉంటున్నావని. ఏమిటి నీలోని ఆ వేదన! ఎప్పుడూ ఆనందంతో సిగ్గుతో శోభించే నీ వదనం ఇప్పుడిలా తయారయిందేం మాలినీ" అన్నాడు. "ఏముంది బావా! ఒంట్లో బాగుండక ఇలా ఉన్నాను. అంతేగాని నాకు చింత లేమున్నాయి బావా," అంది. "నిజం దాచి నావద్ద ప్రయోజనం లేదు. పోనీ ... చిన్నప్పటి నుంచీ నీవంటే నాకెంత ప్రేమో నీ వెరుగనిది గాదు. మన వివాహ విషయం గురించి మామయ్యతో మాట్లాడదామని వచ్చాను. అమ్మ ముసలిదై పోయింది, మనిద్దర్ని పసుపుబట్టలతో చూడాలని ఉవ్విళ్లూరుతోంది. మామయ్య నా మాట త్రోసివెయ్యడు. కాని అంతకు ముందుగా నీ మనస్సులోని మాట తెలుసుకుని మరీ ఆయనవద్ద కదుపుదామని అనుకుంటున్నాను. ఎంత చదువుకున్నా నీవు బావనేగా" అన్నాడు నవ్వుతూ "వివాహం" అన్న పదం ఆమె హృదయంలో ములుకులా గ్రుచ్చుకుంది. కళ్ళలో అప్రయత్నంగా నీళ్లు తిరిగాయి. బాధతో "బావా! నేను వివాహం చేసుకోదలుచుకోలేదు. దయియుంచి నన్ను మరచి ఇక్కడినుంచి నీవు వెళ్ళిపో, బావా. నీ చిన్ననాటి మాలిని చచ్చిపోయింది." అంటూ ఆమె ముందుకు వెళ్లిపోయింది. ఆమె మాటలకు నాగరాజు అప్రతిభుడై నిలబడిపోయాడు. ఎవరు తన్ను తిరస్కరించింది. మాలిని యేనా! చిన్నప్పటినుంచి బావా బావా అంటూ, నలుగురివద్దా దంపతులనిపించుకుంటు, తనలో ఎన్నో ఆశలు చిగురింపజేసి తుదకు ఆ ఆశాసౌధాలు కూల్చివేసింది తన మాలినియేనా! అనుకున్నాడు. మారుపలుకకుండా వెనుదిరిగి వెళ్లిపోయాడు.

నాగరాజు వెళ్లిన తరువాత ఆమె చాలాసేపు ఆలోచించింది. ఈ పరిస్థితిలో ఇంతకన్న గత్యంతరమేముంది. బావతో సంబంధం అభిలషణీయమే అయినా తన హృదయంలోని బాధతో అతన్నెలా సంతోషపరచగలదు! పైగా అతని జీవితంగూడా తనవల్ల బాధాక్రాంతం అవుతుందేమో అని సమాధానపరచుకుంది.

కాని యాదృచ్ఛికంగా జరిగే సంఘటనలు ఘనీభవించిన మానవహృదయాలనే మార్చివేయుగలవు.

ఆనాడు ఆదివారం. సాయంత్రం ముస్తాబై పూజాద్రవ్యాలుగల పంచి చేతబట్టుకొని తల్లితోగూడా మాలిని ఆంజనేయస్వామి దేవాలయానికి బయల్దేరింది. మాలినివద్ద వ్యతిరిక్త సమాధానం పొందిన మరునాడే నాగరాజు ప్రయాణమైనా మామగారి బలవంతంచేత మరి నాలుగు రోజులాగవలసి వచ్చింది. ఆమె ఇష్టానికి భిన్నంగా పెండ్లాడి తానేం సుఖపడగలడు. కాబట్టి ఆ ఆశను సంపూర్ణంగా తన హృదయంలోంచి తుడిచివేయ వ్యర్థప్రయత్నంచేస్తూ వసారాలో కుర్చీలో కూర్చున్నాడు నాగరాజు.

ఊరికి అరమైలు దూరంలో ఏటిగట్టున ఉన్న ఆ దేవాలయానికి వెళ్లేదారి గుబురుగా ఎదిగిన పొదలతో, భయంకల్గించే కీలుచురాళ్ల రోదలతో నిర్మానుష్యంగా ఉంది. ఏదో మాటాడుకుంటూ ఒకరివెనుక ఒకరు వెడుతున్నారు. ఇంతలో వెనుకవస్తున్న మాలిని తల్లి కంగారుగా "అమ్మాయ్ పాము. తప్పుకో. ఇటు వచ్చెసెయ్" అంటూనే ఉంది. మాటలలో నిమగ్నమయిన మాలిని గమనించకుండా ఏమిటేమిటని వెనుకకు తిరిగింది. క్షణంలో ఆమె కాలు పాముతోకమీద

పడడం, ఆ త్రాచుపాము బుస్సుమని పడగెత్తి కాటు వేయడం జరిగింది. మాలిని "అమ్మా! చచ్చాను" అంటూ గావుకేకపెట్టి క్రిందకు ఒరిగిపోయింది. ఆమె కళ్లు బైర్లు కమ్మసాగాయి. కాటువేసినచోట రక్తం చిమ్మింది. రెండు నిముషాలల్లో ఆమె నోటివెంట తెల్లటి నురగలు రాసాగాయి. భయంతో మాలిని తల్లికి దిక్కుతోచలేదు. దగ్గరలోనే ఉన్న గొల్లల కాపరులను గొంతెత్తి పిలిచింది. పది నిముషాలకు మాలినిని ఇంటికి తీసుకువెళ్ళారు.

కుర్చీలో కూర్చుని పరధ్యానంగా ఉన్న నాగరాజు వీరినిచూసి ఉలిక్కిపడి లేచాడు. మాలిని తల్లి ఒగర్పుతో శోకరాగాన్ని మేళవించి జరిగినసంగతి చెప్పింది, నాగరాజు మాలిని చేతినాడి పరీక్షించి ఒక గాజుగ్లాసు తీసికొని వీధిలోకి హుటాహుటిగా వెళ్లిపోయాడు. ఎలాంటి విషసర్పం కాటువేసినా, చేతినాడి ఆడుతుండగా అతనివద్దకు తీసుకువెళ్ళితే వారికి, నాగరాజు ప్రాణదానం చెయ్యగలడు. అతని వద్ద అత్యంతశక్తివంతమైన ఆకుపసరు, మంత్రాలు ఉన్నాయి. ఐదు నిముషాలలో నఖశిఖ పర్యంతం స్నానంచేసి, ఒకచేతిలో గాజుగ్లాసు నిండుగా ఆకుపసరు తీసికొని వచ్చాడు. పవిత్రంగా పాము మంత్రాన్ని మనస్సులోనే పఠించి, తీగల్ని దండగా చేసి ఆమె మెడలో వేశాడు. బలవంతంగా మాలిని చేత ఆకుపసరు మ్రింగించాడు. కాటువేసిన స్థలంలో చాకుతో చిన్నగాటు పెట్టి రక్తాన్ని బాగా స్రవింపజేసి పసరునే ఆ గాయంపైని కట్టుగట్టాడు. కాస్సేపటికి మాలిని ప్రక్కమీదనే వాంతి చేసుకుంది. మరలా రెండో మోతాదుగా మిగిలిన పసరునంతా ఆమెచే త్రాగించాడు. మాలిని ఈసారి స్వయంగా గుటకవేయగలిగింది. "ఇక పరవాలేదు. గండం గడిచింది" అన్నాడు నాగరాజు. ఇంటిల్లపాదీ అందరి కండ్లలో ఆశాజ్యోతులు మెరిసాయి.

"మాలినీ రాత్రంతా నీవు మేలుకునే ఉండాలి సుమా. జాగ్రత్త. నిద్రపోయి మళ్లీ అపాయం తెచ్చిపెట్టేవు" అన్నాడు నవ్వుతూ. మాలిని సిగ్గుతో తల వంచుకుంది. తనప్రాణాన్ని రక్షించిన బావయెడల ఆమె హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది.

రెండురోజులక్రితం తను తిరస్కరించినబావ, తనకీనాడు ప్రాణదాతైనాడు. చిన్నప్పటినుంచి తనపై ఎన్నో ఆశలు పెట్టుకొని తన సహచర్య మభిలషించిన బావ హృదయాన్ని బాధకు గురిచేసి తను ఎంతో పతితురాలైంది. దానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. పశ్చాత్తాపంతో ఆ విశాలహృదయుడి పాదాలపైబడి క్షమించమని ప్రార్థించాలి. ఎంత ఉత్తముడు కాకపోతే ఆనాటి తన మాటలకు నిరుత్తరుడై వెళ్లిపోతాడు! తను ప్రేమించాననుకున్న సుధాకర్ మోసంచేస్తే తనకెంత దుఃఖం కలిగిందో దాన్ని స్వయంగా అనుభవిస్తూగూడా, తనను ప్రాణసమానంగా ప్రేమించిన బావను తిరస్కరిస్తే అతడూ తనలాగే బాధ పడతాడని గ్రహించలేనంత మూర్ఖురాలయింది తను. బావవంటి ప్రేమికుడు, ఉదార హృదయుడూ తనకు భర్తగా లభించడం తన పూర్వ జన్మ పుణ్యంతప్ప వేరుకాదు. గతాన్ని మరచిపోలేని మానసిక దౌర్బల్యంతో, అతనిని తిరస్కరించడం తన భవిష్యత్తును నాశనం చేసుకోవడమే అనుకుంది.

మూడవనాటి ఉదయం నాగరాజు ప్రయాణమై మాలిని వద్దకు వచ్చాడు. అతని కన్నుల్లో ఆమెను చూడగానే అప్రయత్నంగా అశ్రుబిందువులు నిండాయి. అతడేదోమాటాడ బోయాడు... మాలిని అతికష్టంపై లేచి "నన్ను క్షమించు బావా! నీపట్ల అవివేకంగా ప్రవర్తించాను". అంటూ అతని పాదాలపై వాలిపోయింది. మాలిని ప్రవర్తన అర్థం కాక, అతడు ఆమెను మెల్లగాలేపి మంచంపై కూర్చోబెట్టాడు. వీధిలోంచి వస్తున్న మాలిని తండ్రి, నాగరాజు చేతిలోని సంచీ తీసికొని, వెనుకగా వస్తున్న శాస్త్రులుగారితో "పెండ్లి ముహూర్తాలు చూడడంలో ఆలస్యమయిందని అల్లుడు అలిగి వెళ్లిపోతున్నాడు చూసారా! ఈకాలపు పిల్లలే అంత. ఎంత తొందరలో ముహూర్తముంటే దానికే లగ్నపత్రిక వ్రాయించండి శాస్త్రులుగారూ" అంటూ నవ్వుతూ నాగరాజు మొహంలోకి చూశాడు. దిగ్భ్రాంతుడై నాగరాజు మాలినివైపు చూశాడు. ఆమె సిగ్గుతో తలవంచుకుంది.



# శ్రీ రామకర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౮౮

సత్యంబుచే లోక జాలముల్ పదువాల్గు
  దానంబుచే, దీనమానవులను
చిత్తశుద్ధినిగల్గు సేవచే గురువుల
  ధనువుచే శత్రులధాత్రి నీవు
ఇక్ష్వాకురామ! జయించిన వాఁడవు;
  'రామ । రామా' యన్ననామ మొండె
భవ బీజముల నెల్ల భర్జించి, సౌఖ్యంబు
  లార్జించు, సంపదలర్థినోసఁగు;
రామ! నీ నామకీర్తన రక్తిసలుపు
వారలకు యమదూతల భయములేదు;
మృత్యుభీతితొలంగు; సమృద్ధికలుగు
రామ! శ్రీరామ! రఘురామ! రామ
  చంద్ర

౮౯

అన్నకు మదిరోసి యాశ్రయింపంగ
శ్రీ విభీషణుని, రక్షించితి వీవు!
  శ్రీరామ! నీనామ చింతనంబందు
  ఎట్టి సామర్థ్యంబు - గుట్టుగాగలదో?
  సర్వేశుఁడొక్కండు శాంభవియొకతె
  బ్రహ్మదేవుఁడొకఁడు - భారతియొకతె
  వాల్మీకియొకరుండు - వ్యాసుఁడొకండు
  సద్భక్తుఁడొక్కండు - శబరియొకర్తె
  యెదొఁగుదురో? లేదు? యెఱిగి
    రెవ్వారు?

మొఱటు మానిసి నేను - మొదలె
    యెఱుంగ
  శ్రీరామ! రఘురామ! చిన్మయా
    కార!-
  రక్షించి కావవే - రఘుపతీ! రామ

౯౦

కృత్యమీకార్య - మకృత్యమార్గంబిద్ది
సత్యమీ కార్య - మసత్యఫలంబిద్ది
యను - వివేచనలేని - మనుజులుధాత్రి
గలరు; గోశిశుహత్యలెలమిని, బ్రహ్మ
హత్యలఁజేతురు హంతకులగుచు;
నిత్యంబు వారొక్క నిమిషంబునిన్ను
ధ్యానింపగాఁజాల యను రక్తుఁడగుచు
వారొనరించిన పాపజాలముల
పరిహరించెదవీవు । పద్మాక్ష! రామ!
మురహారీ! శ్రీరామ! మోక్షప్రదాతా!
అత్యంత దుఃఖంబులణచివై చెదవు;
తారకరామ! సత్యానంద! రూప!
సర్వవేదంబుల - సారమై నీవు
వాటిచేస్తోత్రముల్ - బడయుచున్నావు
సంపదలకు నెల్ల - స్థానమైనావు;
నిర్మలమైనట్టి నీ నామమెవడు
నిత్యంబు స్మరియించు నిష్ఠనాతనికి
మోక్షసామ్రాజ్యంబు - ముక్తియుఁగల్గు,

చ ౧

సాకేత పురములో - స్వగృహంబునఁగల్ప
కముక్రింద, మిగులశృంగారమైన
వేదికపై నీవు వెలసియున్నావు, ర
త్నవికారమైన పద్మంబు, నొక్క
కరమున ధరియించి, మఱియొక్కహస్తంబు
మోకాలిపైనుంచి, శ్రీ కరముగ
విద్యున్నిభశరీర! విమలకమలహస్త!
సీత పార్శ్వంబునఁ జెలఁగుచుండ

నామెఁగాంచుచు, పూర్ణచంద్రాస్యరామ!
ముద్దుమణికిరీటముచేత - ముఱిసినావు;
భజనసల్పెద సతతంబు భక్తవరద!
నాదు తాపత్రయంబుఁబోనాడు మయ్య!

చ ౨

విద్యున్నిభాంగివి - వికచవరముఖివి,
విద్రుమోష్ఠివమర వినుతవీవు!
ఫుల్లపద్మంబులఁ బోలుకన్నులతోడ
చారు నాసికను, యొప్పారెదీవు!
గజకుంభములను, ధిఃకారంబుసల్పెడు
పాలిండ్లు గల్గిన పడతివీవు!
యజ్ఞవేదికకినయగు. మధ్యమును గల్గి
స్త్రీ శిరోమణియయి, చెలఁగెదీవు!

శ్రితజనులకెల్ల వరములిచ్చెదవు నీవు!
సుందరంబైన చిఱునవ్వు జూపెదీవు!
జానకీదేవి! భూజాత! సరసిజాక్షి!
ధ్యానమొనరింతుఁబ్రోవ గదమ్మ! నన్ను

చ 3

శ్రీ గుణోపేత నా శ్రితజనదాత!
సీత! మాణిక్య, మంజీరపదార
విందముల్ మ్రోయనానందంబు జిలుకు
సుందరి; భక్తులఁజూచి, దయార్ద్ర
దృష్టితో, వరములఁదుష్టితో నొసఁగి
రక్షించుమాత - శ్రీరాముని భార్య
సేవించుచున్నాను చిత్తశుద్ధిగను
రక్షింపు మమ్మరో! రాజీవనయన!

చ ౪ (౧)

జయమునొసఁగువాఁడు - జానకీ మానస
మునకు ముదమొసంగు మోహనుండు
అర్కకులవిహారి - హాసముఖమువాఁడు
రామచంద్రుఁడతనిఁ బ్రస్తుతింతు;

చ ౪ (౨)

దండకారణ్య సంచారి - దైత్యకుల, వి
నాశకారి, సంకటహారి - నాణ్యమైన
మణి, కిరీటధారి, ప్రచండమైన చాప
ధారి, రావణాంతకుని, శ్రీ ధరునిఁదలఁతు

చ ౫

చిత్తమందుండి, భక్తులు జింతసేయఁ
జింతలుడిపెడి ధీరుండు; శ్రీధరుండు;
కామితములకుఁ గల్పవృక్షంబు; యూహ
సేయగారానివాఁడు; మాసేమ మరియు
వాఁడు, శ్రీ మనోహర రూపుకాఁడులోక
ములను మోహింపఁజేసెడి ముద్దురామ
భద్రుధ్యానింతునే భక్తిభావమునను
యతఁడు రక్షించునన్ను నహర్నిశంబు

కటకరసాయనం

బాహ్య, అంతర్గత మూలవ్యాధి చికిత్సకు దివ్యౌషధము. ఇందులో ప్రమాదకరమైనట్టియు, అలవాటుకలుగజేయు ఓషధులేవియు చేరియుండలేదు. రుచికరంగాను, సులభముగా సేవించుట కనువుగానున్నది. వివరములకు:

కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్
మద్రాసు — 14.

# శ్రావణ మంగళవారం

శ్రీ అయ్యగారి విశ్వేశ్వర రావు

(గతసంచిక తరువాయి)

ఈ గొడవలో గడియారం పదకొండున్నర కొట్టింది. అప్పుడు ఆవిడ అందుకుంది. ఇంకేం వెడతారు యివాళ. నామాట విని ఏదో కారణం వ్రాసేయండి. ఎందుకలా జంకుతారు. శలవుపెట్టే వాళ్ళంతా సత్యహరిశ్చంద్రులంటారా! అంది హేళనతో, ఊరికే చెప్పారా! మహనీయు డెవరో! 'స్త్రీ బుద్ధి ప్రళయాంతకః' అని.

తప్పనిసరిగా శలవుచీటీ వ్రాశాను — అపారమైన దగ్గు — పడిశం - జ్వరం హఠాత్తుగా వచ్చిందనీ - ఆఫీసుకు రాలేనని - శలవు ఒకరోజుకు మంజూరు చేయవలసిందనీ. భక్తిశ్రద్ధలతో మా ఆవిడ — ప్రక్కయింటి అబ్బాయిద్వారా ఆ శలవుచీటీని మా ఆఫీసుకు రవాణా చేసింది. భోజనాలయ్యాయి. కొంచం విశ్రమించాను. కొంప మునిగిపోయినట్టు ఆవిడ లేపింది. ఆఫీసులో అయితే యిలా పడుకొంటారా? అన్నట్టు! శలవుపెట్టి ఆఫీసులో వుంటే రికార్డురూములో రెస్టు కాకపోతే వేస్టు చేస్తానా ఖరీదుగల శలవుని అన్నాను. గడియారం చూడగా రెండయింది. అప్పుడే మా శ్రీమతి కొత్తపెళ్ళికూతురులాగ ముస్తాబయింది. పేరంటాల హడావిడి ఆవిడలో అప్పుడే ఆరంభమయింది. నాకన్న ముందే - ఇది ఏడాదికోసారి వచ్చే సరదా కాదుటండీ అంది.

ఇదిగో యిలా చూడండి — ఉయ్యాలలో బాబ్జీ పడుకున్నాడు. వాడిప్పుడు లేవడు. ఏ నాలుగింటికో లేస్తాడు, లేచినప్పుడు ఆ ఫ్లాస్కులో వేన్నీళ్ళు వున్నాయి. అదిగో గ్లాస్కో డబ్బా. విసుక్కోకుండా పాలుకలిపి వాడికి పట్టించండి. మీరే అన్నారుగా! 'ఎవరి పిల్లలు వాళ్ళకి బరువా?' అని అంది. ఒకప్పుడు మనమాటలు మనకే యెదురుతిరిగి బెదిరిస్తాయి కదూ!

ఓహో! యిదంతా ఛార్జిలిస్టు అన్నమాట. సరి — మొదటిది చంటికుఱ్ఱాడికి పాలిచ్చి - ఏడవకుండా చూడటం. యిహ రెండోది ఏవిటో చెప్పు చప్పున — అన్నాను యింకేం పురమాయిస్తుందోనని—

ఏమీలేదండి - మూడుగంటలకి అప్పలమ్మ వస్తుంది. ఆ మూలవున్న అంట్లు దానికే వేసేయండి. ఈలోపుగానే మీరు — మీ కాఫీ ఆ కుంపటిమీద కాచుకొని, ఆ కాఫీగ్లాసులు కూడా దానికి వేసేయండి. అన్నీ జాగ్రత్తగా లెక్కపెట్టుకొని యింట్లో పెట్టించండి. దాని దగ్గఱవుండి యిల్లంతా వూడిపించండి. దాసీవాళ్ళని వెయ్యి కళ్ళతో చూస్తూండాలి. నేను లేనుకదా అని, అవి పెట్టండి! యివి పెట్టండి! అని అడుగుతారు దండుముండలు. మెతకపడి యిచ్చారుకనక అని యింకా చెప్పింది.

బావుంది. ఇంత బ్రతుకూ బ్రతికి యింటి వెనకాతల చచ్చాడన్నట్టు యీ వెట్టిచాకిరీకూడా నేను చెయ్యాలన్నమాట — ప్రత్యేకంగా శలవుపెట్టి! అన్నాను - దిగాలుగా!

మీ దగ్గఱవున్న బలహీనత అదే! అన్నింటికీ మాందర ఢీలాపడతారే! మనపని మనం చేసుకోవడం వెట్టిచాకిరీ ఎన్నటికీ కాదు — అంది ఆవిడ.

అది సరేకాని — యింకేం చెయ్యాలంటావ్ యివాళ అన్నాను. పెద్దాడు రాంబాబు - నేను వెళ్ళానని ఏడుస్తాడు స్కూలునుంచివచ్చి. వాడిని యింకా ఏడిపించక - ఏదైనా కొనిపెట్టండి. సుధీర్ నిద్రపోతున్నాడు. వాడు లేవగానే ఏడుస్తాడు. అదుగో ఆ అలమార్లో బిస్కట్లున్నాయి. వాడికి అవిపెట్టి వూరుకోపెట్టండి. మంజుల - ఆడపిల్ల! దానికి పేరంటం సరదావుంది. వస్తాననంటుంది. దాన్ని నేనుకూడా తీసుకువెడుతున్నాను. తలుపులు బార్లా తీసుకొని గుఱ్ఱెట్టి నిద్రపోకండి - పట్టపగలే దొంగతనాలు - దోపిడిలు చేస్తున్నారట. ఊరేమీ బాగాలేదు - ఇలాగ ఎన్నో సలహాలిచ్చి — యిలు జాగ్రత్త అంటూ హెచ్చరించి, చరచరా స్నేహితురాండ్రతో శ్రీమతి పేరంటానికి పోయింది.

మనలాగే యీ శ్రావణమంగళవారం నాడు మన ప్రక్కవాటాలలో ఎవళ్ళైనా శలవుపెట్టి సంసారానికి పహరా పడుతున్నారా! అని చూదామనిపిం

చింది. ఆ వాటాలపై ఒక చిన్న త్రిప్పుకొట్టి యిల్లే యింట్లోకి వచ్చాను. అప్పటికప్పుడే అంత నిద్రా మానేసి – ఆ సుధీర్ ఓ కేక పలవిపట్టాడు, ఊరుకోరా - బాబూ - ఊరుకో! అన్నాను. ఊరుకుంటే గదా వాడు. ఊరుకోమన్నకొద్దీ ఏడుస్తున్నాడు. అమ్మ ఏది? అంటాడు - ఆ ఏడుపులోనే! వస్తుంది నాన్నా – అలా పేరంటానికి వెళ్ళింది – అమ్మ. నీకు యింతకొక్కెంత పప్పులు తెచ్చిపెడుతుంది – మిఠాయికూడా తెస్తుంది. దర్జాగా తిందువుగాని, ఊరుకోవూ! అని ఎంతో చెప్పాను. నాకేమి వద్దు. ఇప్పుడు అమ్మ కావాలి. చూపిస్తావా లేదా? అని ఆరంభించాడు. హెచ్చుస్థాయిలో ముఖారిరాగం. దానికితోడు భరతనాట్యం. ఈ అల్లరికి ఆ చంటి పిల్లాడు ఉయ్యాలలో – యిట్టే ఉలిక్కిపడుతున్నాడు. వీడి ఏడుపు చల్లగావుంటూ – మానడు కదా, ఇది పనికాదని మా ఆవిడ చెప్పినమంత్రం వుందిగా. అలమారలోంచి – నాలుగుబిస్కట్లు తీసి వాడిచేతిలో పెట్టాను. యింకా కావాలన్నాడు. మరి లేవురా బాబూ అన్నాను. నామాట నమ్మక - ఆ బిస్కట్లడబ్బా అంతా యిమ్మన్నాడు. ఇవ్వనంటే మళ్ళీ ఏడుపు. వాడు యిలా ఏడిస్తే – ఆ వుయ్యాలలో కుర్రాడుకూడా లేస్తాడేమోనని నాభయం. అంచేత – సుధీర్ముందర ఆ బిస్కట్లడబ్బా పడేశాను. పిల్లకాండోలాగ ఆ కుర్రకుంక అన్ని బిస్కట్లు అయిదు నిమిషాల్లో తినేసి మళ్ళీ ఏడుపు లంకించుకున్నాడు. బిస్కట్లు తిన్న బలంతో బహుపసందుగా మొదలెట్టాడు ముఖారి ఆలాపన. అలా కూర్చున్నావేం – లే - అమ్మదగ్గఱకు తీసుకుపో – అమ్మ కావాలి! అమ్మ కావాలి! అని ప్రారంభించాడు పోరు. ఎంతవటికూ శాంతంగా వుండగలను చెప్పండి. కళ్ళెఱ్ఱచేసి - నోరుమూస్తావా - లేదా? అని బెదిరించాను వాడిని. ఈమాత్ర యేమీ పనిచేయలేదు, సరిగదా పరిస్థితులు యింకా విషమించాయి. పెద్దగొంతుకతో అమ్మా - అమ్మా అని ఏడుపు ఆరంభించాడు వాడు. వాడి సముద్రంహోరు వంటి ఆ కంచుకంఠం ఏడుపుతో ఉయ్యాలలో తియ్యగా నిద్రపోతూన్న కుర్రాడుకూడా లేచాడు. లేవడమేమిటి - ఆ ఏడిచే అన్నగారిని చూడటమేమిటి - అన్నగారి ముఖారి గానకచేరికి వంతపాట లంకించుకున్నాడు. ఊరుకోరా! అని సుధీర్కి వుయ్యాలవూపుతూ చిన్నవాడిని సముదాయించాను. ఎవరిమీదా - నాప్రయోగం ఫలించలేదు. ఇద్దరి

ఏడుపూ యింట్లో ఎంతో సందడిగావుంది. ఇంతలోనే గడియారం కంగుకంగున మూడు కొట్టింది. ఒకగంట ముందుగా లేచాడు చంటివాడు. ఆ సుధీర్ అలా ఏడవకపోతే యింకా కాస్సేపు పడుకునేవాడే పాపం. వాళ్ళ అమ్మ నాలుగు గంటలకుగాని - పాలు పోయవద్దంది. వీడి ఏడుపు మానిపించే సాధనం తోచలేదు. యింక - సుధీర్ ఆ దేస్థాయిలో పాడుతున్నాడు ముఖారిపాట. ఇంతలోనే బెలూన్ సాయిబు యిన్ని రంగురంగుల బెలూన్లు మోసుకొనిపోతున్నాడు కిర్రుకిర్రు చప్పుడు చేసుకుంటూ. ఆ బెలూన్ సాయిబును చూడగానే సుధీర్ ఏడుపును తగ్గించుకున్నాడు. అది కొనిపెట్టమన్నాడు. పోనీలే - యిది నయమేనని ఆ బెలూన్ సాయిబును పిలిచి వాడికీనచ్చిన రంగుగల పెద్ద బెలూన్ను కొనిపెట్టాను. ఆ బెలూన్ను చేతిలో పెట్టుకొని కాస్సేపు – ఎగరేసి కాస్సేపు సుధీర్ ఆనందిస్తున్నాడు. ఫరవాలేదు - వీడిపోరు శాంతించింది అనుకున్నా. కాని చంటికుర్రవాడు కలత నిద్రలోంచి కంగారుగా లేచాడేమో – వుయ్యాలా వూపినా వూరుకోవటంలేదు. వచ్చీరాని సినీమా పాటల్ని వినిపిస్తున్నా - పాటలకు పనిపాపలు లొంగుతారని! కాని మా చంటికుర్రాడు నాపాటను వినకుండానే యేడుస్తున్నాడు. ఇది పనిగాదని ఎత్తుకొని అటూయిటూ తిప్పుతూ మళ్ళీ సినీమాపాటలు పాడుతున్నాను. ఈమాటు కొంచంసేపు వూరుకున్నాడుకాని మళ్ళీ ప్రారంభించాడు పాతపోరు. ఇంతట్లోనే అప్పలమ్మ చక్కా వచ్చింది. మా ఆవిడచెప్పిన సలహాల ననుసరించి దానికి అంట్లువేశాను. ఈలోపుగా మా సుధీర్గాడు ఆ బెలూన్ను ఏంచేశాడో మరి - పెద్దచప్పుడుచేసి అదికాస్తా భళ్ళునబ్రద్దలయింది. కొంచం వూరుకున్న చంటికుర్రాడు ఆ చప్పుడికి వులిక్కిపడి పెద్దపెట్టున ఏడుపు ఆరంభించాడు. ఆ బెలూన్ పోయిందీ - పోయింది! అంటూ చెక్కభజన పాజుతో సుధీర్ మళ్ళీ ఏడుపు ఆరంభించాడు. వూరుకోరా! నాయనా! యింకో బెలూన్ కొనిపెడతానులే! అన్నాను. అబ్బే! ఆ బ్రద్దలయిన బెలూన్ మళ్ళీ యథాప్రకారంగా తీసుకువస్తావా చస్తావా అంటాడు. బ్రద్దలయిన బెలూన్ అతుక్కోదురా! కొత్తది కొనుక్కోవాలి - అని నచ్చచెప్పితే - నా వాదం వాడికేమీ అర్థంకాలేదు. వాడి ఏడుపును మాన్పించడం యింక నాతరంకాదనిపించింది. పాపం - చంటికుర్రాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. అప్పుడే నాలుగు దాటింది. ఇంక పాలుపోస్తే

మంచిది — అనుకుంటూ ఫ్లాస్కులో నీళ్లు గ్లాసులో పోసి - గ్లాస్కో పాడుం వేసి - బాగాకలిపి — కొమ్ముచెంబులో పట్టిస్తున్నాను. ఆ చంటిపిల్లవాడికి ఎంతగుర్తో. నాముఖంవైపూ — ఆ పాలచెంబువైపూ చూడటం, ఏడవటం. అలవాటుగా పాలుపట్టించే అమ్మ యేమయిందో అని అడగటమే ఆఏడుపు అర్థం కామోసు. లాలించి - జోలపాట పాడుతూ పట్టించినా — ఆ పాలు తాగటంలేదు వాడు. తండ్రి కలిపినపాలకీ — తల్లి కలిపినపాలకీ తేడా వుంటుందా! పాలు తాగడు. ఏడుపు మానడు. వాడి ఏడుపుతో సుధీర్ ఏడుపు. ఛఛా! ఎంత నరకబాధ! పిల్లిద్దరూ యిలా పెద్దపెట్టున ఏడుస్తూండగానే - ఒక దండుకుక్క ఎలావచ్చిందో మరి — ఆ వంటింట్లో ప్రవేశించింది. కాఫీ కాచుకుందామని అక్కడ వుంచిన పాలు కాస్తా తాగేసింది. అంతటితో వూరుకుందా కనక నా, పాపం - మా ఆవిడ బుద్ధిమంతురాలై రాత్రికికూడా వండిన వంటకాలన్నీ నిర్భయంగా మూతితో ముట్టుకొని బాగా రుచిచూసి - నచ్చినవి తిని - యిల్లంతా మెతుకుల మయంచేసి — నీయింటి కాపలా యింతేనా? అన్నట్టు ఒక అన్నంకరుడు నోటిలో వుంచుకొని వంటింటిగుమ్మంలోంచి తొంగి చూస్తోంది. నాకు పట్టరానికోపం వచ్చింది. అందుబాటులోవున్న అప్పడాలకర్రను తీసుకొని దాన్ని కొట్టాలనే వుద్దేశంతో బలంగా విసిరాను. జంతువులకికూడా ఆపదలనుంచి రక్షించుకొనే తెలివి వుంటుందిగా - ఆ అప్పడాలకర్ర ధాటీని తప్పించుకుని - ఆ కుక్క సరిగ్గా నేనున్నగదిలోకి పరుగెత్తుకువచ్చి - బాబ్జీగాడి పాలగిన్నెను బోర్లగించింది. అన్నిపాలూ వొలికిపోయాయి. అంతటితో వూరుకుందా, దాని పక్కనేవున్న ఆ ఫ్లాస్కునుకూడా తన్ని మరీ పోయింది. అంతఖరీదయిన ఫ్లాస్కు క్రిందపడింది. అయ్యో! అని ఆ ఫ్లాస్కును తీసిచూసేసరికి ఏముంది - లోపలి వేడినీళ్ల బుడ్డి చితికిపోయింది! ఏమనుకోవాలి. ఇలా తిరుగుతూన్న ఆ కుక్కని ఏంచేసినా పాపం లేదనుకొన్నాను. ఒక సర్వీ పేముతీసి సాగదీసి విసిరాను ఆ కుక్కమీదవున్న కోపంకొద్దీ. ఆ తెలివిగల కుక్క ఆ దెబ్బను తప్పించుకుందికాని — ఆ సర్వీకర్ర దెబ్బ సూటిగాపోయి అంట్లుతోమి యింట్లోకి తెస్తూన్న అప్పలమ్మకి చచ్చేటట్లు తగిలింది. చంపినావు బాబూ - అంటూ అప్పలమ్మ గోలచేసింది. అయ్యో! నీకు తగిలిందటే ఆదెబ్బ! అని దాని కాలుపట్టుకొని ఫస్టుఎయిడుచేసి - ప్రమాదమైనదెబ్బ కాదని ధైర్యంచెప్పి - యిల్లు వూడవక్కర్లేదులే యివాళిటికి అని దానికి ఆపని తగ్గించి — యింటికి పొమ్మన్నాను. కుంటుతూ - కుంటుతూ అది నన్ను శపించిందేమో! నాకు వినిపించలేదు మరి - యింటికి పోతూంది!

వెనకటికి ఓపద్యం వుంది "గురువులరాక — దాసీ స్మృతి — గుఱ్ఱపుదాడియు అల్లుడల్కయున్, వరసతి గర్భవేదన వివాహము కిత్తులజల్లు కాల్చియున్"... అంటూ యింకా. ఈ వరస యివాళ మాయింట్లో ప్రతిబింబించిందిగా — అనుకున్నాను.

చిన్నవాడు ఏడిచి ఏడిచి - అలిసిపోయి ఆఖరికి నిద్రపోయాడు. బెలూన్ పేచీ పెట్టిపెట్టి — ఓపిక వున్నంతసేపూ ఏడిచి - ఆ కుక్క చేసిన అల్లరిసందడిలో ఏడుపు మఱచిపోయాడు సుధీర్, ఇల్లు కొంచం శాంతించింది. పెద్దవాన హోరుతగ్గినట్లుంది - అనుకుంటూండగానే - పెద్దాడు రాంబాబు వచ్చాడు స్కూలునుంచి, వస్తూనే - వాడు, అమ్మేది నాన్నా అన్నాడు. అబద్ధం చెప్పాలని లేక - వున్నసంగతి రాంబాబుతో చెప్పాను. చెప్పిందే తడవుగా — లేని ఏడుపు తెచ్చుకొని - నన్ను తీసుకొని వెడతానని చెప్పిందీ - చెప్పిందీ అంటూ ఆరంభించాడు ఏడుపు. మగాళ్లు పేరంటానికి వెళ్లకూడదు నాన్నా. నువ్వు ఆడదానివా? చెప్పు. ఇదిగో యీ అణా తీసుకొని ఆ మిఠాయికొట్లో ఏమయినా కొనుక్కో అన్నాను. ఏమనుకొన్నాడో మరి - ఏమీ గొడవచేయకుండానే వాడు ఆ అణా పుచ్చుకొని చక్కాపోయాడు. ఫరవాలేదు — మనవాడు బుద్ధిమంతుడే - అనుకున్నాను. వీధిలో — ఇంతట్లోనే రిక్షావచ్చి ఆగింది. గడియారంవైపు చూస్తే అయిదున్నర అయింది. ఎవరు చెప్మా దిగింది యీరిక్షాలో - అని చూస్తినిగదా! ఎవరింక — మా ఆవిడే. ముఖం నిరుత్సాహంగా వుంది. ఆపిల్ల మంజుల తలకి అద్దేవిటి ఆ కట్టు! నెత్తురుమరకలు కూడాను. నాకు చాలా కంగారు పుట్టింది. ఇంట్లోకి వచ్చింది ఆవిడ. మంజులని మంచంమీద పడుకోబెట్టింది. సుధీర్ వైపు చూసింది. కన్నీళ్లు ఎండిపోయి బుగ్గలమీద చారలుపడ్డాయి. సొమ్మసిల్లినట్టు ఆ నిద్రపోయే కొడుకుని ముద్దెట్టుకొని - అంత ఏడిపించారా సుధీర్ని అంది నామీద మొదటినేరం మోపుతూ, అరే — ఫ్లాస్కు అలాపడిపోయిందేండీ బ్రద్దలయిందా? ఏం మనుష్యులం - పెద్దసిరవాకం, చేశారు అంది కోపంతో - రెండోనేరం మోపుతూ

అయితే — అన్నిబిస్కట్లు ఒక్కనాడే పెట్టుకుంటారా ఎవళ్లయినా, అంటూ మూతిని మూలమూలలకీ ముడిచింది, ఇల్లంతా యిలావుందేం - ఆ అప్పలమ్మ యిల్లు వూడవకుండానే పోయిందా. వూడిపించమని చెప్పావుగా — ఎందుకంట దానిమీద మీ కంతకనికరం ? అంటూ యింకో నేరం మోపుతూ - వంటింట్లోకి వెళ్లింది. ఆడది లేనికొంప ఎలావుంటుందో ఇప్పుడర్థమయిందా మీకు ? ఏమిటండీ యిదంతా ? అని ఆ కుక్క చేసిన గొడవని - ముక్కుమీద వేళ్లుంచుకొని చూసింది. అయితే రాంబాబు స్కూలునుంచి రాలేదా ? అని అడిగింది. వచ్చాడు. అమ్మ ఏది ? అని తెగఏడిచాడు. ఎంతచెప్పినా వూరుకోలేదు. వాడికి ఒకఅణాయిచ్చి మిఠాయి కొనుక్కోరా అన్నాను. అది పుచ్చుకొని వెళ్లిపోయాడు యింకా రాలేదు. చాలా సేపయింది. ఎవళ్లతోనో ఆడుకుంటూ వుంటాడు - అన్నాను.

చాల్లెండి. కుర్రాణ్ణి అలావదిలేసి - ఎంత సేపటికీ రాకపోయినా చీమయినా కుట్టదే మీకు. చూసిరండి - అని సణుక్కుంది. అంతటితో వూరుకుందా, ఏ మగాళ్లనయినా చూడముచ్చటేస్తుంది. ఇల్లంతా యించక్కా చక్కబెట్టుకుంటారు. నేను చేసుకున్న పుణ్యం యిలా బద్దలయింది. ఎందుకూ ఆశ లేదు. అని విసుక్కుంటూ — నా మూలంగా వచ్చిన నష్టకష్టాల్ని మాటమాటకీ సాగదీస్తూ వంటింట్లోకి పోయింది ఆవిడ. మాటలు ఫెటీల్ ఫెటీల్మనే ధాటీతో మారుమ్రోగుతున్నయి.

ప్రాణం ఒప్పక - మంచంమీద పడుకున్న అమ్మాయి మంజుల దగ్గరకుపోయి - ఎందుకమ్మా — అలా కట్టు కట్టుకున్నావు తలకి - అన్నాను. ఆ వెర్రిపిల్ల కళ్లనీళ్లు తెచ్చుకొని - సైకిలుకింద పడ్డాను - అంది. అయ్యో వెర్రితల్లీ - సైకిలుకింద పడ్డావుటే - అని ఓదారుస్తున్నాను. శ్రావణమంగళవారం ఎంత పని చేసింది ? అనుకుంటూండగానే ఆవిడ గొంతెత్తింది.

వెళ్లి — కుర్రాణ్ణి వెతకండి — తరవాత మాట్లాడుకుందాం మిగతా విషయాలు — అని ఒక పెద్దకేక వేసింది ఆవిడ. తనకే పుత్రప్రేమ వున్నట్టూ - నాలో లేనట్టూ !

వాదించి ఏంలాభం, గొడవా - గొడవా పెరిగి కొండంత కావడం. నలుగురూ వినడం - నానారకాలుగా అనుకోవడం. ఆ పద్ధతి సుజనపద్ధతి కాదని చెప్పిన ఏనుగు లక్ష్మణకవిని తలుచుకొని - గడప దాటి — గేటుదాటి రోడ్డుమీద వచ్చేపోయేవాళ్లను చూస్తూ మిఠాయికొట్టు దగ్గరకుపోయి - సెట్టీ మా వాడు వచ్చాడా ? అన్నాను. వచ్చాడు సార్. మిఠాయికొని గోదావరి ఒడ్డువైపు పోయారండీ — వాళ్ల అమ్మదగ్గరకు పోతానంటూ అన్నాడు ఆ సెట్టి. నా గుండెలు లటలట మన్నాయి. గోదావరి ఒడ్డుకు పోయాను. గోదావరితల్లి జోరుగా ప్రవహిస్తోంది. డబ్బాగొట్టం చేతివాపలతో పిల్లవీరులలాగ సాహసంగా పోతున్నారు కొంతమంది — ఉప్పొంగే ఆ గోదావరి ప్రవాహం వెంబడి, పెద్దచెట్లు - చిన్నచెట్లు తెగకొట్టుకు వస్తున్నాయి. ఆ గౌతమికి కైమోడ్పులర్పిస్తూ — కోటిలింగేశ్వర స్వామిని సేవిస్తూ — కుంకుమ - పసుపుపొట్లాలు గిరవాటేస్తున్నారు కొంతమంది ఆడాళ్లు. అంతా గుంపులు గుంపులుగా వున్నారు. ఈ గుంపుల్లో వున్నాడేమో రాంబాబు అని గుంపులన్నీ వెతుకుతున్నాను - అంతులేని ఆతురతతో. ఇక్కడే - పిడుగులాగ కనబడ్డాడు మా ఆఫీసు డఫేదారు జగ్గయ్య. కనిపించి వూరుకున్నాడా, దగ్గూ రొంపా-జ్వరంట కదాసార్-గోదావరి గాలిలో తిరుగుతున్నారేం ? అన్నాడు. అప్పుడే అనుకున్నాను తప్పుడు కారణాలతో శెలవుపెట్టినట్టు వీడు నన్ను టముటమా చేస్తాడా యేమిటి ? అని దిగాలుపడుతూ - ఏంచెప్పను — జగ్గయ్యా, అవన్నీ వున్నాయి, చూడు. ఎలా దగ్గుతున్నానో అని కొంపిలందగ్గు చూపించాను - బలవంతంగా: ఒళ్లు చూడు — ఎలా వేడిగావుందో ! అన్నాను. రొంప ముక్కులో లేదు — అయినా, రొంపభారం కాస్త నయం జగ్గయ్యా అని నేనంటూంటే — గాలి మంచిది కాదు, గాలిలో తిరగకండి బాబయ్యా అన్నాడు జగ్గయ్య. మా పెద్దాడు రాంబాబుని ఎరుగుదువుగా — వాడు కనిపించటంలేదయ్యా, వాడికోసం వెతుకుతూ వచ్చాను - యిన్నిబాధలతోటి అన్నాను. అలాగటండీ చెప్పరేం అని జగ్గయ్యకూడా నాతోపాటు వెతకడం ఆరంభించాడు. ఎంత వెతికినా రాంబాబు కనిపించలేదు.

ఇంటికి యీపాటికి వచ్చాడేమో - కనుక్కుందాం అని జగ్గయ్యా - నేను యింటికి వచ్చాం. మా ఆవిడ దిక్కుమొహం పెట్టింది. ఇలుగూ-పొలుగూ వాళ్లు ఎలా పసికట్టారో రాంబాబు రాలేదని - బుద్ధిగల కుర్రవాడమ్మా అని కొందరూ — ఇంతసేపూ ఎక్కడ వున్నాడోనని కొందరు - వస్తాడు - తప్పక వస్తాడని

కొందరు వ్యాఖ్యానిస్తూ – ఓదారుస్తున్నారు. రాలేదా – అని నేనూ జగ్గయ్యా అడిగేసరికి – రాలేదండీ అని బేరుమంది మా శ్రీమతి. పోనీ – పోలీసు స్టేషనులో కంప్లెయింటు యివ్వకూడదా? అని ఒకరు సలహా యిచ్చారు. ఔను – అదీ మంచిదే అనుకున్నాను. చప్పున పోలీసు స్టేషనుకు పోవాలి అని తీర్మానించుకున్నాను. ఇంతట్లోకే మా యింటిప్రక్క వెంకమ్మగారువచ్చి – ఎవరో ఏడేళ్ల కుర్రాడు గోదావరిలో పడిపోయాడుట. జనం విరగబడిచూస్తూన్నారు అంది. ఆమాట విని మా ఆవిడ బేరుమని పెద్ద ఏడుపు ఏడుస్తూ – రాంబాబూ – నాయనా! అంది. నీ మొహంలా వుంది, ఎవడో గోదావరిలో పడితే – వాడికీ – రాంబాబుకీ సంబంధం యేంవుందే పిచ్చిదానా! అని నేను సముదాయించాను. జవాను జగ్గయ్యకూడా అలాంటి ప్రమాదం దేవునిదయవల్లరాకూడదు – రాదు అని జోస్యంచెప్పాడు. చల్లనిమాటలు, పుత్రశోకాన్ని చల్లారుస్తాయా. గర్భశోకంలోవుండే లోతు కన్నతల్లికే తెలియాలి. మా ఆవిడ యింతబెంబేలు పడినా – నేను మాత్రం చెక్కు చెదరకుండా శాంతంగా నేవున్నాను. నేనంతదీమాగావుండటం – మొండితనం అంటుంది మా ఆవిడ. లేవండి – పోయి వెతకుదాం రాంబాబుని అంటూ తానూ లేచింది. ఇంట్లోకి పోయింది. అన్నితలుపులూ బిడాయించింది. నిద్రపోతూన్న సుధీర్‌ని లేపింది. ఆ మంజులనికూడా తనతోరమ్మంది. ఉయ్యాలలోంచి బిడ్డని తీసి ఎత్తుకుంది. పెద్దతాళంకప్ప నా చేతిలో పెట్టి తాళం వేయమంది. ఆవిడతొందరకు తట్టుకోలేక తాళం బిగించాను. నడవండిచూస్తారేం అంది. జగ్గయ్యకూడ వస్తానన్నాడు పాపం. ఎంతజాలిగలవాడో. ఆవిడ – నేనూ – జగ్గయ్యా పిల్లల్ని ఎత్తుకోవడంలో – పంచుకున్నాం. ఎంతపనిజరిగింది? అని అందరూ జాలిపడ్డారు. సత్యనారాయణస్వామిని తలుచుకో తల్లీ. కుర్రాడుకనిపిస్తే ప్రతి ఆదివారం నీకు కొబ్బరికాయకొడతాను మహానుభావా – అని మొక్కుకోమన్నారు. ఏడుకొండలవాడా! ఆపదమొక్కులవాడా! అని వెంకటేశ్వరస్వామికి దణ్ణంపెట్టుకోమన్నారు. కొండకివస్తాం – అడుగడుగులదణ్ణాలవాడా! అని మొడుకట్టమన్నారు. ఆకొడుకిమీద వున్న ప్రేమకొద్దీ – అందరు చెప్పినమాటలూ ఆలకించి – భక్తి శ్రద్ధలతో ఆదేవుళ్ళందరికీ అలాగే

వాగ్దానంచేసింది. ఆపద – భక్తినీ – దేవతలనీ ఎక్కువజ్ఞాపకం చేస్తూంటాయికదూ. ఇన్నీచేసి – శకునం చూస్తూంది ఆవిడ. వెఱ్ఱివెధవ – యింత సేపు యెక్కడికైనా పోయివున్నాడా! యీపాటికి అన్నం – అన్నం అంటూ కొంగుపట్టుకొని గొడవ చేశేవాడు. ఎక్కడున్నావ్ – రాంబాబూ ఏం చేస్తున్నావు నాయనా! దీర్ఘరాగంతీసింది. నీకుమతి వుందా – లేదా అని కసిరాను. ఆవిడ – ఏడుపు మాని – నావైపుచూసి, అలా ఆలాకించండి – మన తలుపులుకదూ చప్పుడవుతా, ఎవరో? అమ్మా! అని పిలుస్తూన్నట్లులేదూ! నిదానంగా వినండి – అంది. ఆమాటలువిని జగ్గయ్యకూడా కళ్ళనీళ్ళు తెచ్చుకొని గాబరాపడ్డాడు. తల్లి తన బిడ్డకోసం ఎంత తల్లడిల్లుతుందో చూడండి. తల్లికన్న దేవత లేదన్నారు. అంచేతనే అమృతం అమ్మగుండెల్లోనే వుంటుంది. అందువల్లనే స్వర్గామం – కన్నతల్లితో సమానమై స్వర్గాన్నికూడా నిలిచిగెలుస్తుందన్నారు – అంటూ ప్రక్కయింటి తెలుగు మేష్టారు – మా సీనుచూసి వర్ణించారు. మళ్ళీఅంది – ఆవిడ! నిజంగా తలుపులు లోపలనుంచి చప్పుడవుతున్నట్లున్నాయి. అదిగో! అమ్మాఅనేపిలుపు. ఆగొంతుక రాంబాబుదిగాదూ! అంది కుంగిన గొంతుకతో – పొంగే బెంగతో, అదంతా – భ్రాంతి వెఱ్ఱితల్లీ! యిప్పుడేగా మీరు యింట్లోంచివస్తా. ఇంతట్లోనేరాంబాబుఎక్కడినుంచి వస్తాడు? ధైర్యం తెచ్చుకోండి. ఆపదలందుధైర్యము … అన్నారు కవులు. అని మళ్లీతెలుగు మేష్టారు చెప్పుతున్నారు. ఈ మాట తలుపులు చప్పుడైనట్లు అమ్మా అని పిలుస్తూన్నట్టు – ఆ గొంతుక రాంబాబుదే అయినట్లునాకూ వినిపించింది. ఏవండిమేష్టారూ నాకూ మా ఆవిడకు వినిపించినట్లే వినిపించిందండీ అన్నాను. మీచాదస్తం – చేయవలసినపని మరచి పోకండి. విలువగల టైమును వేస్టుచేయకండి అన్నారు తెలుగు మేష్టారు. పోనీ – అనుమానం వదలిపోతుంది – ఆతాళం చెవియిలాయివ్వండి – ఒక సారి యిల్లాంతాచూస్తాను అన్నాడు జవానుజగ్గయ్య. చటుక్కున తాళంతీసి – జగయ్యతలుపులు తెరచేసరికి – అమ్మా – అమ్మా – అంటూ ఏడుస్తూరాంబాబు గంతులేసుకుంటూవస్తున్నాడు. ఆనందం మెరిసేకళ్ళతో – ఆతురతతో – రాంబాబూ! రా! నా బాబూ! రా! అంటూ ఆ తల్లి తనివితీరా ఆ ముద్దుబిడ్డను గట్టిగా ముద్దెట్టుకొని కౌగలించుకుంది.

అందరూ తెల్లబోయారు. వుయ్యాల్లో బిడ్డను పెట్టుకుని వూరంతా వెతికినట్టుంది - అనేసామెత అందరి నోళ్ళలోను సందడి చేసింది. ఇదంతా మామూలంగానే జరిగింది. తిన్నగా చూడకుండా కంగారు పెట్టారు - అని నావైపు చురచురా చూస్తూ పిల్లలతో యింట్లోకి పోయింది శ్రీమతి. మంచివారికి కష్టాలు వచ్చినా మబ్బులలాగ విడిపోతాయండీ! అంటూ మా ఆవిడను పలకరించి – నా దగ్గఱ శలవుతీసుకొని జవాను జగ్గయ్య చక్కాపోయాడు. పోనీలెండి_ లేచినవేళ మంచిది! అని మిగిలినవాళ్ళు ధైర్యంగా యిళ్లకు వెళ్లారు.

ఔరా! శ్రావణమంగళవారం _ ఎంతపని చేసింది! పిల్లసైకిలుకింద పడటం! రాంబాబు యిలా చేయడం! మావాడి ఫ్లాస్కు బద్దలుకొట్టడం! వంటింటిని కుక్కకి అప్పచెప్పడం - అప్పలమ్మని సర్వేపేడుతో బాదడం! చాలా బాగుందికదూ! అని మా శ్రీమతి, పొరుగింటి వనజాక్షమ్మగారితో చెప్పుతూంది. దేవతల మొక్కుల్ని మాత్రం తీర్చాలో - ఆపద మొక్కులూ - సంపదమరుపులూ! అంటారండి!

మా ఆవిడకున్న చాదస్తం - భక్తి ఎవరికీవుండవు. అక్షరాలా ఆర్యాపురం సత్యనారాయణస్వామి కోవెలకు యిప్పటికీ ప్రతిఆదివారంనాడూ పోయి కొబ్బరికాయకొడుతుంది. ప్రతి యేటా తిరుపతికి బ్రహ్మోత్సవసమయంలో వెళ్ళాలని తీర్మానించుకొని మొన్ననే మొదటి మొక్కుబడి యాత్ర ముగించాం.

గిర్రున తిరిగి మళ్లీ శ్రావణమాసం వచ్చింది. పేరంటానికి పోను బాబూ యింక _ అని మా శ్రీమతి శపథం పట్టింది _ నిరుటి శ్రావణమాస కథని తలుచుకొని! పేరంటాళ్ళంతా _ ఏమండీ మీరు పేరంటానికి రారేం! సరదాలేదా' అని అంటూంటే _ రాంబాబూ అంటుంది వెంటనే కంగారుగా యిప్పటికీ!

—o—


అతిత్వరలో అవతరిస్తున్నది

# దేవదత్తం

తెలుగు వారపత్రిక

చిత్తూరు

శాశ్వతచందా రు. 116/-లు
సంవత్సరచందా రు. 10/-లు
6 మాసములచందా రు. 5/లు
విడిప్రతి 20 న. పై

ఆంధ్ర సారస్వతంలో సర్వాంగ సుందరముగా వెలువడనున్న వారపత్రిక. మనోహరములైన కథానికలతో, మధురగేయ స్రవంతులతో, మహోజ్వలములైన వ్యాసపరంపరలతో, నవ్య భావనాతరంగముల డోలికలలో పాఠకుల నుర్రూతలూగించనున్న యీపత్రికలో స్త్రీలకు, స్త్రీలసమస్యలకు కొన్ని పేజీలు ప్రత్యేకించబడుతవి. ఆదరాభిమానములతో చందాదారులుగా చేరండి!

ఏజంట్లు వెంటనే షరతులకు, వివరములకు వ్రాయండి!

కె. సభా
మేనేజింగ్ ఎడిటరు




# నెలరాజుతో — నెయ్యము

శ్రీ మరువాడ సూర్యప్రకాశం



చల్లనిరాజా - చందురుడా!
తెల్లనిమల్లెలు - పూచెనులే
మల్లెలతోడను - మాలనుగట్టెద
మాలనునాసఖి - మెడలో వేసెద ॥చ॥

మబ్బులోదాగే - చందురుడా
డబ్బులునాకడ - చేరెనులే
డబ్బులుతోడను - దుస్తులుకొంటా
దస్తులునాసఖి - కిచ్చెదలే ॥చ॥

వెన్నెలరాజా - చందురుడా!
పున్నమరేయి - వచ్చెనులే
పున్నమరేయిలో - పందిరిక్రిందను
ప్రణయవతినినే - కలసెదలే ॥చ॥

నెలరాజాఓ - చందురుడా!
కలవరమేలను - చందురుడా.
కలవరపడకను - కీర్తినిపొందుము
ఫలమీయగదే - ప్రార్థనలివిగో ॥చ॥





అన్ని
నొప్పులకు

అమృతాంజనము

పండిత డి.గోపాలాచార్యులవారి

జీవామృతం



ఆరోగ్యానికి
బలానికి

ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్,
మదరాసు-17.

# సుభాషిణి

మూలం :
టాగూరు కథలనుండి

స్వేచ్ఛానువాదం :
శ్రీమతి వేదుల లీలావతి



బెంగాలీ దేశములో వనికాంతుడు ఉన్నత కుటుంబమునకు చెందినవాడు. ఈయనకు సుకేశిని, సుహాషిణి, సుభాషిణి అను ముగ్గురుకుమార్తెలు కలరు. సుకేశిని కేశసంపద చూచుటకు చాలా మనోహరముగనుండును. సుహాషిణి వదనము తీయని చిఱునవ్వులతో ఆకర్షణీయముగానుండును. సుభాషిణి మూగజంతువులతో యింపుగా మాట్లాడగలదు.

కాలక్రమమున సుభాషిణిపేరు. "సుభ" క్రింద మారినది. వనికాంతుని కుమార్తెలలో సుభ రూపలావణ్యములు కల్గియుండేది. ఈమెయేకడసారిపిల్ల. మరియు చినప్పటినుండియు మాట్లాడుట తెలియదు. సుభమూగదగుటవలన తల్లిదండ్రులు బంధువులు యీమె భావిజీవితము యెట్లుండునోయని తరచుబాధపడుచుండెడివారు. వనికాంతునకు సుభయందు అమితమైన ప్రేమగలదు. దానికి ఆమె మూగతనమే కారణమనుకుంటాను. ఈమెవిషయములో తల్లి ప్రతీరోజు కన్నీరు కార్చుచుండేది. తనకు మూగపిల్లను యిచ్చినందులకు భగవంతుని నిందించేది, అది యీమెకు పరిపాటి. సుభ తన మనోభావములను ఎదుటివారికి చెప్పలేదు. కాని తన విషయములో తల్లిదండ్రులు, బంధువులు బాధపడుచుండుట గ్రహించి లోలోపల కుమిలిపోయేది. ఆమె మనోవేదన గ్రహించువారెవరు ?

వనికాంతునకు కుమార్తె వివాహము ప్రధానసమస్య అయినది. పాపము ఏమిచేయగలడు ? మూగదైనను వెర్రిదైనను పెండ్లి చేయుటతప్పదు కదా ! సుభకు యౌవనోదయము కలిగినది. ఆమెలో భావములు, వయసునకు తగినవలపులు లేవనుటకు వీలులేదు. ఆమె యౌవన పుష్పమునకు మూగతనము కళంకము తెచ్చిన. లేనిచో ఆమెనువలచి కోరి పెండ్లాడుదురనుటలో అతిశయోక్తిలేదు. సుభ ఎదుటి వార్ని పలుకరింపలేకపోయినను ఆమె వదనమునకు ఆమె కాటుకకండ్లు క్రొత్త శోభను తెచ్చినవి.

రంగస్థలపు భయమున్న కొంతమంది వారి మనోభావములను పొందికైన మాటలరూపములో వెల్లడి చేయలేరు. సుభ మూగ దగుటవలన ఆమెలో కలిగిన భావములు చిగురుటాకులు కదలునట్లు ఆమె పెదవులు ఆమెభావములను వ్యక్తపరచేవి. ఆమెలో కలిగిన భయము ఆత్రుత మనోవేదన, ఆమె కాటుకకండ్లు తెలియపరచేవి. మూగవారితో మాట్లాడువారెవరు ? ఈమె యంటే అక్క చెల్లెండ్రకు అమితమైన అసూయకలదు. ప్రతీవిషయములోను సుభతో అకారణ వైరముపొందుట వార్కి అలవాటైనది. అందువలన సుభ ప్రకృతిమాత అంకమందు ప్రశాంతముగ కూర్చుని, ఆమాతయందు లీనమై, ఆనందించుట అలవరచుకున్నది. నిర్మలమైన ఆకాశమువలె ఆమెవదనము, లోతైన సముద్రమువలె గంభీరమైన హృదయము కలిగియున్నట్లు కనిపించుచుండేది.

శరభాషిణి, పంగుళి అను కామధేనువువంటి రెండు గోవులు వనికాంతునకు కలవు. ఆగోవులు సుభకు అంతరంగిక స్నేహితులవలె సంచరించుచుండేవి. మరియు గోవులు సుభకు ప్రతిరోజు ప్రేమపూరితమైన స్వాగతమిచ్చుటకలదు. శరభాషిణిమెడను తన చేతులతో ప్రేమపూరితమైన ఆలింగనము చేసియు, పంగుళిముఖమును సుభ ప్రేమతో నిమురుచుండెడిది. అనేకసార్లు తన స్నేహితులను కలసుకొనివచ్చుట, సుభ దినచర్యలలో ప్రధానచర్యగ తీసుకున్నది. పవిత్రమైన ఆగోమాతలు సుభముఖమందు కళవళికలను బట్టి, ఆమెకు కలిగిన ఆనందవిషాదములను గ్రహింపగలుగుట ఆశ్చర్యముకాదు, గొర్రెలు లేగ దూడలు, పిల్లిపిల్లలు, యీమెకు మరియొకస్నేహబృందము. రాత్రిసమయమందు సుభకు సమీపములో ఆలేకూనలు గంతులు వేయుచు ఆనందముగ ఆడుకొనుసమయమున తన మెత్తనిప్రేళ్ళతో ఆలేకూనలను నిమురుచుండగా, ఆ కూనలు మైమఱచి సుభయంకమందు నిద్రచెందేవి.

బెంగాలీ దేశములో చండీపురమునకు ప్రక్కగా విశాలమైన నది ప్రవహించుచుండెను. ఆప్రాంతమున నివసించుప్రజలకు, తనవలన యెట్టి ప్రమాదము రాకుండ తనహద్దులందు, ప్రశాంతముగ ప్రవహించుచు, ఆ నది ప్రజలతో కలసిమెలసి ప్రవహించుచున్నది. ఆనదికి సమీపములోనున్న చెట్ల

సముదాయములును, ఆ సముదాయములందున్న గృహములు చూచుటకు ఆకర్షణీయముగను, మనోహరముగనుండెను. ఆగృహములలోని ఎత్తైన వనికాంతుని గృహము పల్లెవాండ్రకు, పడవవాండ్రకు ఆశ్చర్యము కలిగించేది. ఆప్రదేశమంతా వర్తకులతోను, పల్లెవాండ్రతోను నిండియున్నది.

తల్లిదండ్రులు కుటుంబ బాధ్యతలయందు కుమారులకు స్థానము కల్పించక పోవుటవలన ప్రతిగ్రామము నందును పనిపాటులు లేక వీధులందు తిరిగెడు సోమరిపోతులు అందరకూ తెలిసినవిషయమే కదా! అట్టివారి జాబితాలోనికి చేర్చబడిన ప్రతాప్‌ను అతని తల్లిదండ్రులు చేపలనుపట్టుటకు నియమించారు. సాయంసమయమున ప్రతాప్ నది ఒడ్డున చేపలను పట్టుట నేర్చుకున్నాడు. దీనికోసము ఆ నదిప్రక్కన యెక్కువ కాలము వినియోగించుట ప్రతాప్‌నకు అలవాటైనది. సాయంసమయమందు సుభ ఆ నది ఒడ్డునకూర్చొని ప్రకృతి మాతతో సంతోషముగా మాట్లాడుకునేది. గ్రామప్రజల వింతవింత ధ్వనులతోను, చల్లని చెట్లగాలులతోను, పక్షుల కిలకిలారావములతోను, ఆమె సున్నితహృదయము ఆనంద కెరటములమీద తేలిపోవుచుండేది. విశ్రాంతిలేని ఆమె హృదయమునకు చల్లని పిల్లవాయువుల ధ్వనులు విశ్రాంతినికూర్చేవి. ఆవిశ్రాంతి సమయమున సుభ సమీపవృక్షసముదాయములతో మాట్లాడుట ఆశ్చర్యముగా నేయుంటుంది.

సూర్యభగవానుడు పడమటిదిక్కున అస్తమింపగా సమీపవాతావరణమంతా చీకటులు క్రమ్ముకొనెను. పల్లెవాండ్రు, పడవవాండ్రు, వారివారి విందులకు, వినోదములకు పురోగమించిరి. గ్రామ ప్రజలు వారివారి పనులయందు నిమగ్నులై యుండిరి. పక్షులు ప్రశాంతముగా గూళ్ళయందు నిద్రించుచున్నవి. నదిలోనిపడవలు కదలికలు మాని నిశ్చలముగానుండెను. ఆ నదియొడ్డున సుభయు, ఆమె స్నేహితురాలు ప్రకృతియు మాత్రమే యుండిరి. సమీపములో చేపలను పట్టుచున్న ప్రతాప్ వంటరిగ ప్రశాంతహృదయముతో కూర్చున్న సుభను చూచి ఆమెను అనుసరించి ఆమె నిశ్చలమైన ప్రశాంతకు మెచ్చుకొని గౌరవించెను. హిందూమతప్రకారము భగవంతునకు సహస్రనామములుకలవు. నాగరికత యుగములో కూడ ప్రతిమానవునకు సహస్రనామములుకలవు. హిందూమతరీత్యా ఏనామముతో పిలచినను భగవంతుడు పలుకుటకలడు. అదేమాదిరిగా కలియుగమానవులు సహస్రనామములతో వ్యవహరింపబడుచూ ఏ నామముతో పిలిచినను పలుకుచున్నారు. మాగ్రామములో కరణంగారి కోడలుపేరు అనసూయ. ఇది ఆమెతల్లిదండ్రులు చిన్నతనములో పెట్టుకున్న పేరు.

చిన్నతనములో తోటిబాలికలతో ఆడుకొను సమయమందు, తోటి బాలికలమీద కొండెములు చెప్పుట వలన, చుట్టుప్రక్కలవారును బంధువులును "సంగనాచి" అని పిలుచుటకూడ కలదు. కౌమారదశయందు తోటివార్నిచూచి ఓర్చలేని కారణముచేత "అసూయ" అని పిలచేవారు. యౌవనపుష్పము వికసించిన పిదప, వివాహ అనంతరము, అత్తమామలు పెట్టిన నామమునచ్చక ఆమెభర్త "అనూ" అని సార్థకనామము చేసాడు. ఈ నామములన్నియు మా వూరి కరణంగారి కోడలు అనసూయకు చెందినవే. ప్రతాప్‌నకు మరియొక చెలికత్తె అవసరమనుకుంటాను. సుభను విడిచియుండలేక ప్రతిక్షణమందును, ఆమెను అనుసరించుచు, ప్రేమతో సుభను, నోటినిండా "సూ" అని పిలచుచుండేవాడు. సుభ నామము కాలానుగుణ్యముగా "సూ" క్రింద మారినది. నది ఒడ్డునకు సమీపములోనున్న వటవృక్షమునకు కొద్ది దూరములో తదేకదీక్షతో ప్రశాంతముగా చేపలను పట్టుటయందు నిమగ్నుడైయున్న ప్రతాప్‌ను చూచుట, సుభకు దినచర్యలో ప్రధానచర్యగా మారినది. ప్రతాప్‌నకు కావలసిన ఆహారపదార్థములు సమకూర్చి అతనికింకా సహాయము చేయవలయునని తలచేది. ప్రపంచములో యే మానవునకు నుపయోగము లేని అమాయకబాలిక, ఇటువంటి సమయములో "సూ" ప్రతాప్‌నకు యేవిధముగా సహాయము చేయగలదు? ఆమె శక్తివంచనలేకుండా కులదేవతను యిట్లు ప్రార్థించుచుండేది.

"నేను చేసిన సహాయమునకు ప్రతాప్ మెచ్చుకొని "సూ" నీకింత శక్తి యెక్కడనుండి వచ్చినది?" అని ప్రతాప్ "తలచునట్లు నాకు అనంతమైన శక్తి ప్రసాదించుము" అని వేడుకొనుచుండెడిది.

"నేనొక నీటిదేవతనైనచో? నేను నీటి అంతర్భాగమునకుపోయి, పాము పడగమీదనున్న మణిని తీసుకొని బంగారుపొన్నుపై పరుండి వెండిపళ్లెరములో తినుబండారములు తినుచు ఉల్లాసముగానున్న సమయమున, పనికిమాలినచేపల నిమిత్తము నీటి అంత

ర్భాగమునకు వచ్చిన ప్రతాప్ నన్ను చూచి ప్రేమించ గలడు. మహారాజా కుటుంబములో పుట్టుటకు బదులు సామాన్య వనికాంతుని కుటుంబములో పుట్టినందు వలన యిది యసంభవము." అని "నూ" మధుర స్వప్నములు కనుచుండెను.

రాత్రి సమయమున పూర్ణచంద్రుడు తన చల్లని కిరణసముదాయములను వెదజల్లుచుండెను. ప్రకృతి ప్రశాంతముగ నిశ్చలముగా నుండెను. "నూ" నెమ్మదిగా తనగది తలుపులుతీసి బెమరు యూపులతో వెలుపలకు చూచెను. ప్రకృతిమాతకూడ నిద్రపోవు మానవ లోకమువైపు చూచుచున్నది. "నూ" యొక్క హృదయము స్పందించుచుండెను. ఒకవైపు ఆనందము, మరియొకవైపు విచారచిహ్నములు ఆమె మానసమును వేధింపుచున్నవి. తాను యేకాకినని మధ్యమధ్య "నూ" బాధపడుట కలదు. ఆ ప్రశాంతసమయమున కలిగిన హృదయవేదన మరెన్నడునూ కలుగలేదు. "నూ" వలె ప్రకృతికూడ ఏకాకివలె బాధపడుచుండెడిది.

శుభ పెండ్లివిషయము ఆమె తల్లిదండ్రుల హృదయములను కలవరపెట్టుచూ వారిని క్రుంగదీయుచున్నది. లోకులు నూకు యింతవరకు పెండ్లి చేయనందులకు నిందించుటయే కాక కులమునుండి వెలివేయుటకు నిశ్చయించిరి. వనికాంతుడు మిక్కిలి ధనికుడును, మృష్టాన్న భోజనప్రియుడును. ఇతని భోగలాలసతకు అనేకమంది అసూయపడుచూ "నూ" పెండ్లి విషయములో మాటిమాటికి వనికాంతుని కుటుంబమును వేధించుచుండిరి.

వనికాంతుడు చేయునదిలేక కుటుంబముతో కలకత్తా వెళ్లవలయునని నిశ్చయించి ఆ మరునాడు ఉదయమున కలకత్తా పయనమయ్యెను. ఆ సమయమున అవ్యక్తమైన మనోవేదనతో "నూ" హృదయము బరువెక్కి అప్రయత్నముగా ఆమె నేత్రములనుండి బాష్పములు రాలుచుండెను. తల్లిదండ్రులను మూగజంతువువలె అనుసరించి "నూ" పోవుచుండెను. ఆమె కాటుక కండ్లు తల్లిదండ్రుల ముఖములను పరికించుచున్నవి. కాని వారు ఆమెకు చెప్పునదికూడ లేదనుకుంటాను. "నూ" తన ఆంతరంగిక మిత్రులకు వీడ్కోలు చెప్పుటకుపోయి ఆ మిత్రబృందమును వీడలేక, వీడలేక వీడిపోయెను.

పెండ్లికుమార్తెలను, పెండ్లికుమారుల అభిరుచుల కనుగుణముగ అలంకారములుచేసి వారియెదుట వరించుటకు హాజరుపెట్టుట నవీనపద్ధతి వధువునకు, యెట్టి అలంకారము చేయవలయును? అని నెలకు ముందే ఆలోచనపై ఆలోచనచేయుచు లేని అలంకారములు సమకూర్చుచు పెండ్లికుమారులు వచ్చుదాక వేచియుందురు. పెండ్లికుమారులు వచ్చి పెండ్లికుమార్తెలనుచూచి పెదవుల విరచుట అందరకూ అనుభవనీయమే కదా!

"నూ"ను ఆమెతల్లి అలంకారముచేయుచూ కుమార్తె కేశములను జడఅల్లి రంగురంగుల గుడ్డపేలికలలో బిగించి అందముగా కట్టుచున్నది. క్రొత్తరకములైన అలంకారములు సమకూర్చినది. "నూ"ను చూచుకొనుటకు స్నేహితులతో వచ్చిన పెండ్లికుమారుడు, "నూ"పై అలంకారములుచూసి పెండ్లిచేసుకొనుటకు అంగీకరించెను.

అంతవరకు కుమార్తె వివాహవిషయము యేమగునోయని భయాందోళనచిత్తులైయున్న ఆమె తల్లిదండ్రుల హృదయములు చల్లబడినవి. వనికాంతుడు తనకుమార్తెను మరియొకని హస్తమందుపెట్టి కలకత్తా నుండి చండీపురమునకు చేరెను. కొద్దిరోజులకు "నూ" మూగదని అందరకూ తెలిసిపోయినది. ఈ విషయములో "నూ" నిర్దోషి. ఆమె యెవరిని మోసగించనూ లేదు. మరియు ఆమె హృదయములోని మనోవేదన గ్రహింపలేకపోయినను, నిర్దోషి యని మాత్రము ఆమె కాటుక కండ్లు చాటుచున్నవి. "నూ" నలువైపులా పరికించుచున్నది. కాని ఆమెను పలుకరించువారెవరు? ఆ సమయములో "నూ"నకు ఆంతరంగిక మూగజంతువులు జ్ఞప్తికి వచ్చినవి. ప్రశాంత గంభీరమైన హృదయములోని వేదన—

కల్లోలము సర్వహృదయాంతర్యామియగు నీశ్వరునకే యెఱుక.



# స్వీకారము

ఉపదేశమాల : శ్రీ స్వామి శివానంద సరస్వతి మహారాజ్. అనువాదకుడు, ప్రచురణకర్త – మంగాల సూర్యప్రకాశరావుగారు, దివ్యజీవన సంఘ సభ్యుడు, గాంధీ నగరం, కాకినాడ.

ఇందులో శ్రీ స్వామివారి ఉపదేశములు పొందుపరచబడినవి. మానవజీవయాత్రలో అనుక్షణం మార్గదర్శకమగు నీ ఉపదేశములు సంఘంలో సకలవిధములతోడ్పడి అభ్యుదయ పురోభివృద్ధులకు తోడ్పడును. అనువదించి ప్రచురించిన శ్రీ సూర్యప్రకాశరావు భగవదనుగ్రహమునకు పాత్రులు.

తోడేటి దొరతనము (వృకవంచకీయము) : విద్వత్కవిభూషణ – విద్వాన్ వేంకటకృష్ణశర్మగారు, c/o ఉదయరంజనీ పబ్లిషర్స్, 66 స్వామిపిళ్లై వీధి, చూళై – మద్రాసు. 7 వెల 50 న. పైలు

ఇందలి కథావస్తువులో పాత్రలు వన్యమృగములైనా స్వార్థపరులయొక్కయు, తద్వ్యతిరేకుల యొక్కయు మనస్తత్వములనెత్తి చూపుటయే ప్రధానముగా సాగినది. కథాగమనము, భావసంపద, రచనా నైపుణ్యము మనోజ్ఞముగానున్నది. బహుగ్రంథకర్తయైన పండితుడగుటచే నీ గ్రంథము చిన్నదయినా బహుళోపయుక్తముగా విద్యార్థులకు పఠనీయమగునట్లు శ్రీ శర్మగారిచే రూపొందించబడినది.

♦ ♦ ♦

వినయాశ్రమం రజతజయంతి నివేదిక మా కార్యాలయమునకు చేరినది. పూజ్యబాపూజీచే ప్రారంభించబడిన నీ ఆశ్రమము కాలక్రమమున అభివృద్ధిగాంచినరీతి, దాని అభివృద్ధికి, పోషణకుతోడ్పడిన సంస్థలు, వ్యక్తులవివరములు, నిర్వహించిన నిర్మాణకార్యక్రమము, మొదలగు అనేకవిషయములు యిందు వివరింపబడినవి.

♦ ♦ ♦

శ్రీశివానంద ఆశ్రమం (ఋషీకేశము) నుండి వారి యీక్రింది ఆంగ్లప్రచురణలు మా కార్యాలయమునకు చేరినవి !

Sivananda—the darling of children by Sri Swami Sivananda-Haridayananda, Price Re. 1
Practice of Bhakti yoga - by Sri Swami Sivananda - Haridayananda. Price Re. 1
Immortal Teachings by Sri Swami Sivananda by Sri A.G.R. Sharma. Price 25 nP.

పై మూడు ఆంగ్లగ్రంథములు చిన్నవైనా ఆధ్యాత్మిక, పారమార్థిక చింతలను ప్రోత్సహించి దివ్య జీవనమునకు మార్గదర్శకములగునవి. కడుసులభశైలిలో ఆత్మ, పరమాత్మలజ్ఞానముతోబాటు నైతికంగా పతనావస్థలోనున్న మానవసంఘాన్ని స్వామి శివానందమహారాజ్ జీవితము, బోధనలు, ఆశిస్సులు ఉద్ధరించగలవని కంఠాపథంగా చెప్పనగును.

---


పాత్రుడుగారి

## బాలసంజీవిని (Regd)

పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును

డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,

19, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు–4. Phone 71354

కుంభకోణము బ్రాంచి : 7. సారంగపాణి కోవిల తూర్పువీధి.

అన్ని మందుల షాపులలోను దొరకును.

# సంపాదకీయములు

## ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి అభ్యుదయాలు

ఆంధ్రప్రదేశ్ సాధించిన అభివృద్ధి అభ్యుదయాలు పేర్కొనతగినవనే చెప్పాలి. ప్రధాని నెహ్రూ సయితము యీ సందర్భమున అభినందించాడు. ఇందుకు కారణం ప్రజల సహాయసహకారములు, అధికార, అనధికారవర్గాల కార్యదీక్షయని చెప్పనగును. అయినా ప్రజలలో - ముఖ్యంగా జాతీయవాదులలో మరింత సమరసద్భావములు పెంపొందితే జాతీయ నాయకత్వము బలపడటమే కాక ప్రణాళికల లక్ష్యాలు నూటికినూరు పాళ్లు ఫలప్రదం కాగలవు.

ఈ నాటి పరిస్థితులలో ప్రజావసరాల గిరాకికి ఉత్పత్తిదారులకు, వినియోగదారులకు పరస్పర సానుభూతి సద్భావములు లోటుగా కనుపించుచున్నది. దీనిని బలవంతంగా ప్రభుత్వము సాధించిపెట్టగలదని ఆశించడం పొరబాటు. ఉత్పత్తిలోని సాధకబాధకములు అనేకము అయినా తమలాభాలను పరిమితం చేసికొని ప్రజల దైనిక సమస్యలను సానుభూతితో చూచినచో యీ నాడు బియ్యం, చింతపండు, చక్కెర, నూనెలు వగైరాల ధరలు విపరీతముగా పెరిగిపోవడము జరిగియుండేది కాదు.

ప్రజల ఆదాయప్రమాణమును మించి విపరీతముగా ధరలు పెరిగి ముఖ్యంగా మధ్యతరగతివారు, గిజగిజలాడుతుంటే భూస్వాములు, వ్యాపారులు అధికలాభాలకు ప్రాకులాడటం అమానుషమని చెప్పాలి. నిర్మించబడిన ప్రాజక్టులు, విద్యుత్ కేంద్రాలు ముందుముందు మహత్తరమైన సత్ఫలితాల నీయనున్నమాట వాస్తవమే. అది అభ్యుదయచిహ్నమే అయినా ఏ నాటికానాడు విషమపరిస్థితుల నెదురుకొంటున్న ప్రజానీకాన్ని, వారి సమస్యలను నిర్లక్ష్యము చేయడం ఎవరికీ మంచిది కాదు. ఇది ప్రజలలోని ఐక్యత సద్భావములకు చిహ్నము కానేరదు.

## డాక్టరు గోవిందరాజుల వెంకటసుబ్బారావు

సుప్రసిద్ధ సినిమానటులు, వైద్యులు శ్రీ వెంకటసుబ్బారావుగారు స్వర్గస్థులు అయిన సందర్భమున మా సంతాపమును తెలుపుచున్నాము. పాత్రౌచిత్యమును గుర్తించి నటించిన వారిలో నొకరు. డాక్టరుగా సయితము రోగులను పరీక్ష చేయుటలోను, చికిత్స చేయుటలోను ఆసక్తి, ఓర్పు మహామెండుగానుండేవి. ఆయన మాటల్లోను చేతల్లోనుకూడ నటిస్తున్నాడా యనిపించేది. కళాపిపాసి, కళారాధకుడుగా మాత్రము కాక పరోపకారిగా సయితము చిట్టచివరదాక జీవయాత్ర సాగించిన ధన్యుడు. వారి యాత్మకు భగవంతుడు పరిపూర్ణశాంతిని ప్రసాదించుగాక !

---

నూతనంగా వెలువడిన 'సారంగి' మాసపత్రిక మా కార్యాలయమునకు ప్రథమ సంచిక చేరింది. సంపాదకుడు శ్రీ తుమ్మలపల్లి సీతారామారావు. కార్యస్థానము 196 లాయిడ్స్‌రోడ్డు, మద్రాసు 5. విడిసంచిక 60 నయాపైసాలు సాలుచందా రు. 8/లు

సంపాదకుడు అనుభవజ్ఞుడు, సుప్రసిద్ధ రచయిత అయినా స్వతంత్రంగా పత్రికను స్థాపించి నిర్వహించ పూనుకోడం సాహసమనే చెప్పాలి. ప్రథమసంచిక సర్వాంగసుందరముగా వెలువడింది. ఇందలి ఉత్తమ రచనలు, శీర్షికలు అన్ని వర్గాలవారిని ఆకర్షించునవిగానున్నవి, పత్రికస్థాయి ఉత్కృష్టమైనదై విద్యా విజ్ఞాన, వినోదములు కూర్చునదిగానుండుటచే ప్రజల ఆదరాభిమానములకు పాత్రము కాగలదని ఆశిస్తున్నాము

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణీ స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

**3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.**

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 ఔ॥ రు. 3-10 6 ఔ॥ రు. 5-50**

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 ఔ॥ల బుడ్డి రు. 3-0**

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2-0**

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4-0**

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు, బెంగుళూరు**




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

లోధ్రలో హానికరమైన వేవీ లేవు. సుఖప్రదమైన జీవితానికి ఆరోగ్యాన్ని చేకూర్చడానికి అది గట్టి మందు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం.

**కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్,**
**రాయపేట - మదరాసు - 14.**






ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికింద్రాబాద్, బరంపురం